

## ఇందులో :



12

1-4-49

# జనత




సంచిక 12 | * 1-4-1949 * | వెల: ఎనిమిదణాలు

# లెనినిజం :: అంతర్జాతీయ ప్రాముఖ్యత

వర్తమానయుగం లెనినిజంయొక్క మహత్తరభావాల విజయంకోసం జరిగే పోరాటయుగంగా మానవజాతి చరిత్రలో ప్రసిద్ధికెక్కింది. మార్క్సిజాన్ని అభివృద్ధిచేసి ముందుకు తీసుకొని వెళ్ళింది లెనినిజం. సామ్రాజ్యవాదమూ, శ్రామికవర్గ విప్లవాల యుగంలోని మార్క్సిజం లెనినిజం. లెనినిజానికి రష్యా జన్మస్థానం. కాని దాని విషయంలోనూ, సారాంశంలోనూ, ప్రాముఖ్యతలోనూ, పాత్రలోనూ లెనినిజం అన్ని దేశాలలోని విప్లవ కార్మికవర్గంయొక్క పతాకం. రష్యాలోనూ, ప్రపంచంలోని యితర దేశాలలోని కార్మికోద్యమంయొక్క అనుభవాన్ని, దృష్టిలో వుంచుకొని లెనినిజం ఒక జనరల్ సిద్ధాంతంగా తయారు అయింది. ఈ సత్యంలోనే లెనినిజంయొక్క అంతరాతీయ ప్రాముఖ్యత యిమిడివుంది.

మనయుగంలోని సాంఘిక అభివృద్ధిలోనూ, అన్నిటికంటే ముఖ్యంగా అంతర్జాతీయ శ్రామికవర్గ ఉద్యమంలోనూ ఉత్పన్నమయ్యే సమస్యలకు పరిష్కారమార్గాలను-లెనిన్‌నూ, ఆయనకు నిజమైన సహచరుడూ, ఆయన అమరఆశయాలను కొనసాగిస్తున్న వ్యక్తి అయిన కామ్రేడ్ స్టాలిన్ చూపెడతారు. బూర్జువా వర్గం, అభివృద్ధి నిరోధకముఠా ఏజెంట్లూ, శిథిలమై అంత్యకాలం సమీపించిన ప్రతి ఒక్క అభివృద్ధి నిరోధక శక్తి లెనినిజాన్ని ద్వేషిస్తాయి. అనేకసార్లు బూర్జువా వర్గానికి అమ్ముడు పోయిన మేధావులూ, అన్ని రకాలకు చెందిన అవకాశవాదులూ లెనినిజంయొక్క మహత్తర ఉపదేశాలను పూర్తిగా తప్పుడు సిద్ధాంతాలని తిరస్కరించుతూ ప్రకటనలు చేయడం జరిగింది. కాని లెనినిజాన్ని కాదని తిరస్కరించడం సాధ్యం కాని పని. శాస్త్రీకజ్ఞానాన్ని కాదని తిరస్కరించడం ఎలా సాధ్యం కాదో, అలాగే ఆ వర్గంయొక్క ముఖ్య ప్రయోజనాలనూ, ఆశయాలను వెల్లడిచేసే లెనినిజాన్ని తప్పని తిరస్కరించడం ఎవరి తరమూకాదు. మానవజాతిలో అభ్యుదయ కరమైనదీ, ఆలోచనతో కూడినదీ, చైతన్యవంతమైనదీ, స్వార్థ రహితమైనదీ – అన్నీ ఏకమై లెనినిజం యొక్క సిద్ధాంత పతాకం క్రింద పోరాడుతున్నాయి. లెనినిజంలోవున్న శక్తివంతమైన అత్యద్భుత శక్తికీ, లక్షలాది ప్రజలలో దాని యొక్క సిద్ధాంతాల ప్రభావం రోజు రోజుకు వృద్ధికావడానికి కారణం ఆ సిద్ధాంతం యొక్క అచంచల సత్యంలోనే యిమిడి వుంది. అంతేకాదు, అదొక్కటే మానవజాతియొక్క అభ్యుదయానికి కావలసిన అవ్యవసరాలను గురించి, శాస్త్రీయంగా ఎలుగెత్తి చాటుతుంది. లెనినిజంయొక్క అత్యద్భుత శక్తికి కారణ మదే.

మనకాలానికి లెనినిజం మహత్తరమైన సాంఘికశక్తి. అనంతకాల ప్రవాహం కానీ, యావత్తు సాంఘిక అభివృద్ధి విధానంగానీ లెనినిజంలోని సిద్ధాంతాన్ని తప్పని తిరస్కరించలేక పోయాయి. పైపెచ్చు అవి లెనినిజం ఒక మహత్తరమైన అజేయ శక్తి అని రుజువుచేశాయి.

II

"సామ్రాజ్యవాదం – పెట్టుబడిదారీ విధానంయొక్క అత్యున్నత దశ" అనేతన గ్రంథంలో లెనిన్ మహాశయుడు పరిపూర్ణమైన, సర్వతోముఖమైన శాస్త్రీయ దృక్పథంతో పరిశీలించి పెట్టుబడిదారీవిధానం పతనా

వస్థలో ప్రవేశించినదనీ సామ్రాజ్యవాదం దానియొక్క అంతిమదశ అనీ నిర్ధారణచేశాడు.

పెట్టుబడిదారీ విధానంయొక్క పతనావస్థ అన్నిటికంటే ముఖ్యంగా సామ్రాజ్యవాదంలోని పరస్పరవిరుద్ధాలు తీవ్రతరమవడంలో స్పష్టంగాగోచర మవుతోంది. కార్మికులకు, పెట్టుబడిదారులకు మధ్యనలస దేశాలకు, వాటిపై పెత్తనం చెలాయించే దేశాలకుమధ్య బలవత్తరమైన గుత్తపెట్టుబడి దారుల మధ్య, వివిధ సామ్రాజ్యవాద దేశాలమధ్య తీవ్రతర మవుతున్న పరస్పర వైరుధ్యాలలో అది స్పష్టమవుతోంది. ఇంతేగాక పెట్టుబడిదారీ విధానం యొక్క పతనం, సామ్రాజ్యవాద దేశాలలో రోజురోజుకు వృద్ధి అవుతున్న సామ్రాజ్య దేశాల స్వార్థంలోనూ, ప్రపంచ మార్కెట్టుపై గుత్తాధికారం గల దేశాల స్వార్థంలోనూ కనపడుతోంది. గత పది సంవత్సరాలలోని సాంఘిక జీవితమూ, పెట్టుబడిదారీ విధానంయొక్క చరిత్రా ఏమి తెలుపుతోంది ?

గుత్తపెట్టుబడిదారీ విధానం — సామ్రాజ్యవాదంయొక్క సూత్రా లను గురించీ, స్థితిగతినిగురించి లెనిన్ చెప్పిన మహత్తరమైన నిర్ధారణలు ఆచరణలో పూర్తిగా రుజువయ్యాయి. ఇది మన జీవితానుభవం. రెండు ప్రపంచ యుద్ధాలమధ్య బ్రిటన్ పరిశ్రమలు 1913 స్థాయిని దాదాపు మించలేదనే చెప్పాలి. నిజానికి ఆ స్థాయికంటె అనేకసార్లు తగ్గడంకూడా జరిగింది. ఫ్రాంసులోని పరిశ్రమలు సహితం ఏమాత్రం ముందడుగు వేయ లేక పోయాయి; ఏవో కొద్ది సంచి సంవత్సరాలలో తప్ప. కాని అదే కాలంలో సోవియట్ యూనియన్‌లోని పరిశ్రమలు 12 రెట్లు అభివృద్ధి చెందాయి. యూరప్‌లో వున్న దేశాలన్నిటిలోనూ ఉత్పత్తిలో మించి పోయింది. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం శత్రువులవల్ల ఎంత గానో ధ్వంసంచేయబడ నప్పటికీ, సోవియట్ యూనియన్ పారిశ్రామిక ఉత్పత్తి లోనూ, పంటలోనూ యుద్ధానికి పూర్వమున్న స్థాయికి అందుకోగలిగింది. అంతే కాదు. దీని సంతటినీ బయటనుండి ఎలాంటి సాయం చేకుండా సాధించ గలిగింది.

నూతన ప్రజాతంత్ర రాజ్యాలుకూడా త్వరత్వరగా తమ ఆర్థిక వ్యవ స్థను తిరిగి నెలకొల్పుకో గలుగుతున్నాయి.

పెట్టుబడిదారీ యూరప్‌లోని దేశాలు — బ్రిటన్, ఫ్రాన్సు, ఇటలీ, బెల్జియంలు ఆర్థికంగా చాలా కష్టాలలో పడిపోయి అంకుల్‌శామ్ (అమెరికా) భిక్షంపై ఆధారపడుతున్నాయి. ఈ దేశాలలోని బూర్జువావర్గం తమ జాతీయ స్వాతంత్ర్యాన్ని అమ్మి, ఆ ప్రజలను స్వదేశ విదేశ (అమెరికా) బూర్జువావర్గ బానిసత్వానికి గురిచేస్తున్నారు. ఈ యదార్థ సంఘటనలన్నీ పెట్టుబడిదారీ విధానం, యిక ఉత్పత్తిసాధనాల్ల అభివృద్ధికి ఒక అడ్డుగా తయారయినట్లు రుజువు చేస్తున్నాయి.

పెట్టుబడిదారీ విధానం యింకా కోలుకోలేని సంక్షోభంలో పడిపోయింది. కార్మికులకూ, పెట్టుబడిదారులకు మధ్యనున్న వైరుధ్యం తగ్గడానికి బదులు 1916 నుండి (సామ్రాజ్యవాదంపై లెనిన్ వ్రాసిన గ్రంథం వెలువడిన సంవత్సరం) మరింత తీవ్రతరమయ్యాయి. ఇది యీ క్రింది విషయాలనుబట్టి స్పష్టమవుతోంది. పెట్టుబడిదారీ దేశాలన్నింటిలో కార్మికవర్గ పోరాటాలు రోజురోజుకూ ఎక్కువగుతున్నాయి. ప్రతిచోటా కమ్యూనిస్టు పార్టీలు అభివృద్ధి చెందుతున్నాయి. కార్మికోద్యమంలో బూర్జువా ఏజెంట్లుగా పనిచేసే మితవాద సోషలిస్టుల పలుకుబడి అన్నిచోట్లా తగ్గిపోతోంది. బూర్జువావర్గంతో సహకరించి పనిచేయాలనే సంస్కరణ విధానం యొక్క దివాళాకోరుతనం బయటపడిపోతోంది. పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా పోరాడటానికి ఉన్నది ఒకేఒక నిజమైన బాట—లెనినిస్టు బాట అని లక్షలాది కార్మికులకు రోజురోజుకు స్పష్టమవుతోంది.

ఆసియాలోని సంఘటనలు — చైనా, ఇండోనీషియాలో, మలయా వియత్‌నాములలో, బర్మా ఇండియాలలో జరుగుతున్న సంఘటనలు—పెట్టుబడిదారీ సామ్రాజ్యవాద దేశాలకూ, వలసదేశాలకు మధ్యనున్న వైరుధ్యాలు తీవ్రతరమవడాన్నే రుజువు చేస్తున్నాయి. వలసదేశాలన్నీ జాతీయ విముక్తి ఉద్యమాలతో మండిపోతున్నాయి. ఈ పెట్టుబడిదారీ సామ్రాజ్యవాద దేశాలకు వలసదేశాలు యిదివరకు అండగా, బలంగా ఉండేవి. కాని ఇప్పుడవి సామ్రాజ్యవాదంయొక్క ఆంతరంగిక బలహీనతకు కారణభూతమయ్యాయి.

రెండు ప్రపంచయుద్ధాల మధ్యకాలంలో ముఖ్యంగా రెండో ప్రపంచ యుద్ధంలోనూ, యుద్ధానంతర కాలంలోనూ సామ్రాజ్యవాద

దేశాలమధ్య జరిగిన పోరాటం – ఎన్నిరకాలవైన "పశ్చిమ", "అట్లాంటిక్" కూటాలూ ఏర్పడినా, ఎన్నిప్లానులు జరిగినా – పెట్టుబడిదారీ దేశాలమధ్య వైరుధ్యాలు తీవ్రతర మవుతున్నాయని స్పష్టంగా తెలియజేస్తున్నాయి. మార్షల్ ప్లాను ముఖ్యంగా దీనినే మరింతగా స్పష్టపరుస్తోంది. పరదేశాలపై పలుకుబడి సంపాదించడానికీ, ముడిపదార్థాలకోసం, పెట్టుబడులు పెట్టేందుకూ, మార్కెట్లను ఏర్పరచుకొనేందుకూ పోరాటాలు ఎక్కువగుతున్నాయిగాని తగ్గడంలేదు.

సామ్రాజ్యవాద యుగంలో వివిధదేశాలలోని అభివృద్ధిలో అసమానత్వం వుంటుందనే సూత్రం ప్రత్యక్షంగా కనపడుతోంది. అన్నింటికంటే బలవత్తర సామ్రాజ్యవాద రాజ్యమైన అమెరికా, యుద్ధంలోబడి పోయిన పెట్టుబడిదారీ దేశాలు – జర్మనీ, జపాన్, ఇటలీలనేగాక ఫ్రాంసు, బ్రిటన్ హాలండ్, బెల్జియం లాంటి దేశాలను కూడా వెనక్కు నెట్టింది. ఈ దేశాల యొక్క పారిశ్రామిక అభివృద్ధిని అరికడుతూ, అమెరికా సామ్రాజ్యవాదులు వీటిని పూర్తిగా తమ ఆధిపత్యం క్రిందకు తెచ్చుకోడానికి ప్రయత్నించుతున్నారు.

పెట్టుబడిదారీ విధానంలోని సంక్షోభం రోజురోజుకు తీవ్రతర మవుతున్నదని చెప్పడానికి అన్నింటికంటే ముఖ్యమైన నిర్ధారణ పూర్వకమైన మరొక కారణం కనపడుతోంది. అదేమంటే, ప్రపంచంలో పెట్టుబడిదారీ విధానం ఒక్కటే ఏకైక విధానంగా మనగలిగే స్థితి యికపోయింది. దానికి వ్యతిరేకంగా సోషలిస్టు విధానం తయారైంది. అది యీనాడు ప్రపంచంలో ఆరోవంతు భూభాగంలో స్థిరంగా వేళ్ళు పాతుకొనిపోయిఉంది. ఒకవైపున పెట్టుబడిదారీ వ్యవస్థ క్రమక్రమంగా క్షీణించిపోయి, పతనం జెందుతూ, ఉంటే మరొక వైపున సోవియట్ యూనియన్‌లోని సోషలిస్టు సమాజం ముందుకు సాగిపోతోంది., కని విని యెరగనంత వేగంగా అభివృద్ధి చెందుతోంది. సోషలిస్టు నిర్మాణంలోని అంతిమ దశలోకి సోవియట్ యూనియన్ ప్రవేశించి క్రమక్రమంగా కమ్యూనిజంలోకి పరివర్తన జెందడం ప్రారంభించింది. దీనికి ప్రపంచమంతటావున్న కార్మికవర్గం సంతోషంతో కేరింతలు కొడుతోంది. సోషలిజానికి శత్రువులైన వారంతా అవమానంతో బాధపడుతున్నారు.

## III

ఆర్థిక, రాజకీయ సిద్ధాంతరీత్యా - అన్ని విధాలా అభివృద్ధి నిరోధక తత్వం కరుడు గట్టడంలోనే సామ్రాజ్యవాదం ఇమిడి ఉందని లెనిన్, ఆయన లెనినిజం మనకు నేర్పాయి. "అన్నివిధాలా వున్న రాజకీయ అభి వృద్ధి నిరోధక తత్వం సామ్రాజ్యవాదం యొక్క సొత్తు." —(లెనిన్).

కిరాతకత్వంతోనూ పశుత్వంతోనూ, మూఢత్వంతోనూ, బంది పోటుతనంతోనూ, అమానుష ద్వేషంతో నిండి నిబిడీకృతమైన రక్తతృష్ణగల ఫాసిజమూ, ఫాసిజానికీ, అభివృద్ధి నిరోధకతత్వానికి 'ఆంగ్లో' - అమెరికన్ సామ్రాజ్యవాదులు నాయకత్వం వహించి, వాటిని పెంచడమూ, సాంప్ర దాయ సిద్ధంగావుండే బూర్జువా ప్రజాతంత్ర దేశంనుండి అమెరికా థామస్ - రాంకిన్ కమిటీలతోనూ ఫాసిస్టు కార్మిక వ్యతిరేక శాసనాలతోనూ, మూడో ప్రపంచ యుద్ధంకోసం ప్రచారం సాగించే అర్ధ ఫాసిస్టు పోలీసు రాజ్యంగా మారిపోవడము, ప్రజలయొక్క జాతీయ సర్వస్వతంత్రానికి ప్రతికూలంగా సామ్రాజ్యవాదులు దాడులు చేయడం - ఇంకా మొదలు గాగల వెన్నో జరగడం - ఇవన్నీ సామ్రాజ్యవాద శిబిరంలో అభివృద్ధి నిరోధక శక్తులు రోజు రోజుకు వృద్ధి అవుతున్నాయని చెప్పడానికి తార్కాణం.

కాని సామ్రాజ్యవాద వ్యతిరేక అభివృద్ధి నిరోధక ఉద్యమానికి వ్యతిరేకంగా సోషలిజం, ప్రజాస్వామిక శక్తుల ఉద్యమం నిలబడి వుంది. ఈ ఉద్యమం నాశనంకాదని, అజేయమని లెనిన్ మనకు బోధించాడు. ఈ ఉద్యమానికి చరిత్ర మూలసూత్రాల పునాది ఉంది. ఈ ఉద్యమానికి కార్మికవర్గం నాయకత్వాన లక్షలాది కష్టజీవుల అండ వుంది. ఈ ఉద్య మానికి అసలు శక్తివంతమైన సత్యమే పునాదిగా ఉంది. ఈ ఉద్యమం సోషలిస్టు భూమి అయిన సోవియట్ యూనియన్ యొక్క మహత్తరమైన పునాదులపైనా, బలంపైనా ఆధారపడి ఉంది.

అక్టోబరు సోషలిస్టు మహావిప్లవ విజయంతో బూర్జువా పార్లమెంటరీ ప్రజాతంత్రియుగం అంతమై నూతనమైన ఉన్నత సోవియట్ సోషలిస్టు ప్రజాస్వామిక యుగం ప్రారంభమయిందని లెనిన్ వ్రాశాడు.

గత పాతిక సంవత్సరాల చరిత్ర, లెనిన్ అపూర్వా జోస్యాన్ని పరిపూర్ణంగా రుజువుచేసింది. బూర్జువా ప్రజాతంత్రం పతనమైంది. అది చిట్టచివరకు గుత్తపెట్టుబడిదారుల (ఫైనాన్సు కేపిటల్) నియంతృత్వంలో ఒక రూపము బట్టబయలు అయింది. ఉదాహరణకు: అమెరికాలో 60 కుటుంబాలు, ఫ్రాన్సులో 200 కుటుంబాలు, బ్రిటన్‌లో కొన్ని డజన్లు లేక ఒక వంద కుటుంబాల పరిపాలన అని అందరికీ తెలిసిపోయింది. లంచగొండితనమూ, అవినీతి, మోసమూ లక్షలాది ప్రజల ప్రాథమిక హక్కులనూ, అభీష్టాలనూ బహిరంగంగా కాలదన్నడం ప్రజలపై క్రూరనిర్బంధ విధానం ప్రవేశపెట్టటం, ప్రజా తంత్రశక్తులను తెగనాడటం, కష్టజీవులైన ప్రజలకు నిజమైన ప్రతినిధులైన కమ్యూనిస్టులను వేటాడటం, విచారణ లేకుండా మరణదండన విధించడం, కార్మికులను తుపాకులతో కాల్చడం, ఫ్రాన్సు, ఇటలీ యింకా యితర దేశాలలో ఆకలితో అలమటిస్తూ తమకు తమ బిడ్డల తిండికోసం పోరాటం సాగించే సమ్మె కార్మికులను సాయుధ బలంతో అణచడం, వీటన్నిటికీ బూర్జువా ప్రజాతంత్రం నేడు ప్రాతినిధ్యం వహిస్తుంది

ప్రజలు కమ్యూనిస్టులకు వోటు చేసినట్లయితే, పార్లమెంటులోనూ, మునిసిపల్ సంస్థలలోనూ అధిక సంఖ్యాకులకు కమ్యూనిస్టులు ప్రాతినిధ్యం వహిస్తే — బూర్జువావర్గం తన యంత్రాంగాన్ని రంగంలోకి దించి, ఓటర్ల అభీష్టాన్ని కాలదన్ని, తను చెప్పినట్లల్లా ప్రభుత్వాన్ని అధికారంలో వుంచుతుందని ఫ్రాన్సులోనూ, ఇటలీలోను జరిగిన పార్లమెంటరీ ఎన్నికలు స్పష్టపరచాయి. ఆ విధంగా కాక మరొక విధంగా జరుగదు. పోరాటం లేకుండా బూర్జువావర్గం తనంతట తానుగా అధికారాన్ని వదులుకుంటుందనే భ్రమలు ఎవరికైనా వున్నట్లయితే, లెనినిజం బోధించే యథార్థాన్ని తమకు తామే స్వయంగా పరీక్షించుకోవచ్చు.

అధికారాన్ని జయించి స్వాధీనంచేసుకొనే సంధానంలో కార్మికవర్గానికి తోడ్పడటం కోసం, పెట్టుబడిదారీ నియంతృత్వానికి వ్యతిరేకంగా మరొక పోరాట పంథా లేదని, లెనిన్ స్టాలిన్‌లు ప్రబోధించారు. పెట్టుబడిదారీ వర్గానికీ, సోషలిజానికీ మధ్య ఒక పరివర్తనదశ ఉంది. పెట్టుబడిదారీ విధానానికీ, సోషలిజానికీ మధ్యనున్న యీ పరివర్తనదశ కార్మికవర్గంయొక్క నియం

తృత్వదశ ఒక్కటే ఉంటుంది. అంటే కమ్యూనిజంకోసం జరిగే పోరాటంలో కష్టజీవులందరికీ కార్మికవర్గ ప్రభుత్వ నాయకత్వ మన్నమాట.

కమ్యూనిజంకోసం, కార్మికవర్గం జరిపే పోరాటం అనేకరకాలైన రాజకీయరూపాలు తీసుకోక తప్పదని లెనిన్ ముందుగానే చెప్పగలిగాడు. కాని సోషలిజం వైపుకు వివిధదేశాలలోని ఒకనిర్ణీతమైన రాజకీయఅభివృద్ధి విధానం అన్నింటికంటే ముఖ్యమైన సమస్యను మాత్రం (కార్మికవర్గ నియంతృత్వాన్ని) త్రోసివేయలేదు.

వేరు వేరు రాజకీయ స్వరూపాలు, వేరు వేరు దేశాలు తీసుకొన్నప్పటికీ పెట్టుబడిదారీ విధానాన్నుండి సోషలిజానికి పరివర్తన చెందాలంటే శ్రామిక వర్గ నియంతృత్వం, కార్మికవర్గంయొక్క అగ్రగామి పాత్రా, కమ్యూనిస్టు పార్టీ నాయకత్వమూ తప్పని సరిగా అవసరమని లెనిన్, స్టాలిన్‌లు బోధించారు. లెనినిజంయొక్క యీ సత్యాన్ని చరిత్ర అనుభవం ధృవపరచింది. పెట్టుబడిదారుల తోకలను పట్టుకొని నడిచేవారూ, కారల్ రెన్నర్‌లాంటి రకం ద్రోహులు మాత్రమే అనేక రకాలైన మార్క్సిజం ఉన్నదని, తత్ఫలితంగా ఎన్ని దేశాలుంటే సోషలిజానికి పరివర్తన జెందడానికి అన్ని ప్రత్యేక రూపాలుంటాయనీ చెప్పగలుగుతారు. పెట్టుబడిదారీ దేశాలన్నింటిలోనూ సాంఘిక అభివృద్ధి సూత్రాలు ఒకటిగానే ఉంటాయి. వాటిని ఎవరూ మార్చలేరు. అందువలన అన్ని దేశాలకూ మార్క్సిజం - లెనినిజంఒక్కటే ఏకైక మార్గం. సోషలిజం, కమ్యూనిజంల నిర్మాణానికి మార్క్సిజం - లెనినిజం కనుగొన్న సాంఘిక విప్లవ సూత్రాలనూ, శ్రామికవర్గ నియంతృత్వాన్ని మాటిమాటికి మార్చడంగాని, అతిక్రమించడానికిగాని వీలుకాని విషయం.

హిట్లర్ జర్మనీని సోవియట్ సైన్యం జయప్రదంగా ఓడించడం మూలంగానే, సోవియట్ యూనియన్ బలమూ, అండా వుండటం మూలంగానే, కార్మికవర్గమూ, కమ్యూనిస్టుపార్టీల నాయకత్వాన నూతన ప్రజాతంత్ర రాజ్యాలు ఏర్పడటం సంభవించింది. ఈ రాజ్యాలు శ్రామికవర్గ నియంతృత్వ కర్తవ్యాల నన్నిటినీ జయప్రదంగా కొనసాగిస్తున్నాయి.

కార్మికవర్గమూ, కమ్యూనిస్టుపార్టీల నాయకత్వపాత్రను నిరాకరించడం, అంటే అది తప్పనిసరిగా దిగజారుడు తత్వానికే, బూర్జువావర్గ

దృక్పథానికి, సామ్రాజ్యవాదుల శిబిరానికి జారిపోతుంది యుగోస్లోవియా లోని కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం లెనినిజానికి చేసిన ద్రోహం ఏవిధంగా పరిణమించిందో తెలుసుకోడానికి చక్కటి ఉదాహరణ.

సోవియట్ యూనియన్‌లో సోషలిజాన్ని జయప్రదంగా నిర్మించిన అద్వితీయమైన అనుభవాన్ని లెనిన్, స్టాలిన్‌ల మహత్తరరచనలు సిద్ధాంతీకరణ చేశాయి. శాస్త్రీయంగా అందరికీ వర్తింపజేసిన యీ అనుభవానికి అంతర్జాతీయ ప్రాముఖ్యత ఉంది.

## IV

ఫ్రాన్సు ఇటలీ దేశాలలోని కమ్యూనిస్టుపార్టీలు ఆ దేశాలలోని కార్మికవర్గంలోని అత్యధిక మెజారిటీని లెనినిజం పతాకంక్రింద ఐక్యం చేయగలిగాయి. ఇది లెనినిజంయొక్క అంతర్జాతీయ దిగ్విజయాన్ని సూచిస్తుంది. గర్వించదగిన చైనాకమ్యూనిస్టుపార్టీ, అది నడిపే ప్రజా విముక్తి సైన్యం, లెనినిజంయొక్క పతాకంక్రింద కొమింటాంగ్ అభివృద్ధి నిరోధక ముఠాపై మహత్తరమైన విజయాలు సాధించింది. ఈ ఘనమైన విజయాలు అమెరికా సామ్రాజ్యవాదానికి ఒక ఓటమి. ఎందువల్లనంటే కొమింటాంగ్ సైన్యాలకు తర్ఫీదునిచ్చి, ఆయుధసంపత్తినిచ్చి బలపరచేది అమెరికా ప్రభుత్వమే.

రుమేనియా, జెకోస్లోవికియా, హంగెరీ, పోలండ్, బల్గేరియా దేశాలలో కార్మికవర్గ పార్టీలు ఐక్యమవడం లెనినిజానికి ఒక గొప్ప విజయం.

ఈ దేశాలలోని కార్మిక పార్టీల కలయికలు కార్మికవర్గంయొక్క శాస్త్రీయ సిద్ధాంతాన్ని – మార్క్సిజం – లెనినిజాన్ని ఆధారం చేసుకొని జరిగాయి. ఈ విధంగా ఆ పార్టీలు ఐక్య మవడమంటే ఆ దేశాలలోని కార్మికవర్గంలోని చీలికలకు స్వస్తిచెప్ప బడ్డాయన్నమాట; కార్మికవర్గ శక్తులు అభివృద్ధి చెందుతున్నా యన్నమాట; కార్మికవర్గంలో సోషలిస్టు చైతన్యం సంఘటనాశక్తి అభివృద్ధి చెందాయన్నమాట. ఈవిధమైన కార్మిక వర్గ ఐక్యత నూతన ప్రజాతంత్ర రాజ్యాలలోనే గాక యితర దేశాలకు కూడా వ్యాపించుతోంది. ఇది ఇతరదేశాలలో కార్మికవర్గం ఏ మార్గాన అభివృద్ధి చెందుతున్నదో తెలుపుతుంది. అంతేకాదు; కార్మికవర్గం ఏ విధంగా

వ సిద్ధాంత ప్రాదిపదికను ఆధారంచేసుకొని తన అనుయాయులలో విప్లవ ఐక్యతను సాధించుతున్నదో కూడా స్పష్టం చేస్తున్నది. పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా విజయాన్నిసాధించాలంటే ఆవిధమైన ఐక్యత అత్యావసరం.

మార్క్సిస్టు పార్టీ నాయకత్వాన, లెనినిజంయొక్క ఆధ్వర్యాన నడిచే శ్రామికవర్గ మొక్కటే అధికారాన్ని సాధించగల శక్తిని కలిగి ఉంటుంది; దానిని నిలబెట్టుకో గలుగుతుంది; సోషలిజాన్ని నిర్మించ గలుగుతుంది. సోవియట్ రష్యాలోని లెనినిజంయొక్క పార్టీ యీ పరమ సత్యాన్ని మనకు బోధిస్తోంది.

మితవాద సోషలిస్టులపై ఎడతెగని పోరాటం జరపకుండా, కార్మికోద్యమంనుండి బూర్జువావర్గానికి కాపలా కుక్కలుగానూ, లంచగొండి ఏజెంట్లుగాను పనిచేసే బెవిన్లనూ, అట్లీలనూ, బ్లమ్‌లనూ, స్క్యామా చార్లనూ, రెన్నర్స్, సారగాట్లను, స్పార్క్సలనూ తరిమివేయనిదే బూర్జువావర్గంపై కార్మికవర్గం విజయాన్ని సాధించడం కష్టం. ఈ సత్యాన్ని లెనినిజం మనకు ప్రబోధిస్తోంది.

1918_20 లలో పెట్టుబడిదారీ విధానాన్ని రక్షించినది యీ మితవాద సోషలిస్టులే. జర్మనీలోకి ఫాసిజం ప్రవేశించడానికి దారిని చక్కబెట్టినది యీ మితవాద సోషలిస్టులే. పోరాటాన్నే ఆయుధంగా తీసుకొని ముందుకు కొనసాగిపోతున్న శ్రామిక ప్రజానీకాన్ని అణచి నాశనంచేసే యీ తప్పుడు ఉద్యోగాన్ని సామ్రాజ్యవాద బూర్జువావర్గం బెవిన్, మోచ్, సారగాట్‌లాంటి అసహ్యకరమైన ద్రోహులకు అప్పజెప్పింది. 1918 లో బూర్జువావర్గం యీ విధంగానే యీ తప్పుడు పనికి నోస్కేని వినియోగించింది.

కాని కాలం మారింది. గతచరిత్రలో జరిగిన సంఘటనలనుండి చాల ఎక్కువగా ప్రజానీకం గుణపాఠాలను నేర్చుకొన్నది. కార్మికోద్యమంలో మితవాద సోషలిస్టులు బూర్జువావర్గానికి ఏజెంట్లుగా తమపాత్రను యింక నిర్వహించడం రోజురోజుకు కష్టమవుతోంది. శ్రామికవర్గానికి బూర్జువాకు మధ్య, బూర్జువావర్గానికి కష్టపడి పనిచేసే యితర ప్రజానీకానికి మధ్యనున్న వైరుధ్యాలు చాల ఎక్కువయ్యాయి. అందువలన కార్మికవర్గంయొక్క పైనాయకత్వానికి లంచాలుపెట్టి వశపరచుకోడం ఫ్రాన్సు, ఇటలీదేశాలలోనే

గాక యుద్ధంవల్ల ధ్వంసంఅయిన యితర దేశాలలోకూడా బూర్జువా వర్గాలకు సాధ్యం కాకుండా పోయింది. బ్రిటన్‌లాంటి దేశాలలోకూడా కార్మికవర్గం పై నాయకత్వాలను లోబరచుకొనే అవకాశాలు తగ్గిపోతున్నాయి. కాబట్టి శ్రామికవర్గానికీ, బూర్జువావర్గానికి మధ్యనున్న వైరుధ్యాలు తీవ్రతర మవడం తప్పనిసరి అవుతోంది. ఈ వైరుధ్యాలు రాజకీయ కారణాలవలనకూడా తీవ్రమవుతాయి. ఎందువల్లనంటే అమెరికా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జాతీయ స్వాతంత్ర్యంకోసం జరిగే పోరాటం, యుద్ధోన్మాదులకు వ్యతిరేకంగా శాంతికోసం జరిగే పోరాటం, బూర్జువావర్గం తలపెడుతున్న జాతీయ విద్రోహానికి వ్యతిరేకంగా సాగే పోరాటంగా మారిపోతోంది. బూర్జువా సామ్రాజ్యవాదులకు కొత్త యుద్ధాలుకావాలి. వారికి శాంతి అంటే తగనిభయం. సామ్రాజ్యవాద యుద్ధాలకు జరిగే ప్రయత్నాలే అసలు యుద్ధమే. పెట్టుబడిదారీ పరిశ్రమలకు పూర్తి పనికల్పించి, పెట్టుబడిదారుల జేబులను లాభాలతో నింపుతుంది.

ఆయుధాల ఉత్పత్తికి ఏ మాత్రం అడ్డు తగిలినా పెట్టుబడిదారీ విధానం బ్రహ్మాండమైన ఆర్థిక సంక్షోభంలో పడిపోయే ప్రమాదం ఉంది. బూర్జువావర్గం శాంతి అంటే భయపడటానికి కారణమిదే. వారు యుద్ధాలకు కాలుదువ్వడానికి కీలకమిదే. ఇక పెట్టుబడిదారీ విధానమూ మానవజాతి శాంతియుతంగా అభివృద్ధిచెంది పురోగమించడం, ఒకదాని ప్రక్క ఒకటి మనగలగడం అసంభవమని చెప్పడానికి యిదొక నిదర్శనం. దీనినే లెనినిజం మనకు చాటి చెబుతోంది.

విప్లవపోరాటం యొక్క సహజపరిణామం పెట్టుబడిదారీ దేశాలలోని కార్మిక వర్గానికి రోజు రోజుకు ఒకసత్యాన్ని గుర్తించేటట్లు చేస్తున్నది. అదేమంటే ఈనాడు అమెరికా సామ్రాజ్యవాదులకూ, తమ స్వదేశాలలోని బూర్జువాలకు వ్యతిరేకంగా పోరాడుతూ దానితోబాటు కమ్యూనిజం కోసం పోరాడకపోతే శాశ్వత శాంతికోసం ప్రజాస్వామిక ప్రజాతంత్రం కోసం, జాతీయ సర్వస్వాతంత్ర్యంకోసం ప్రజల స్వేచ్ఛకోసం పోరాడటం అసంభవమని కార్మికవర్గం రోజురోజుకూ గుర్తిస్తోంది. ఈనాడు కమ్యూనిజం వైపుకు మరలకుండా అసలు ముందుకు పురోగమించడమే అసాధ్యం.

కార్మికవర్గ బలాన్ని విచ్ఛిన్నంచేసే బూర్జువా అవకాశవాద సిద్ధాంత ప్రభావాన్నుండి లెనినిజం ప్రజానీకాన్ని విముక్తి చేస్తుంది. ఇందు లోనే అంతర్జాతీయ కార్మికోద్యమానికి లెనినిజంయొక్క ఆవశ్యకత యిమిడి వుంది. లెనినిజం ఒక్కటే జనసామాన్యాన్ని తన శక్తులలో విశ్వాసాన్ని కల్పించి, ఉద్రేకపరచగలుతుంది. వారికి సరియైన దృక్పథాన్నిచ్చి వారి అజేయతలో విశ్వాసాన్ని కలుగజేసి, పోరాడటానికి ధైర్యోత్సాహాలనిస్తుంది.

లెనినిజం, శ్రామిక జనసామాన్యంయొక్క సృజనాత్మక చొరవను సంపూర్తిగా గుర్తించి అనాటి పరిస్థితులనూ, పోరాటానికిగల అవకాశా లనూ జాగ్రత్తగా పరిశీలించి, దానిని ఖచ్చితమైన శాస్త్రీయ దృష్టితో సమన్వయ పరుస్తుంది. ఇందులోనే లెనినిజంయొక్క శక్తి యిమిడివుంది. లెనిన్ యిలా వ్రాశాడు: విప్లవశక్తినే, విప్లవ సృజనాత్మకత్వాన్ని, ప్రజా నీకం యొక్క విప్లవాత్మక చొరవనూ, వివిధ వ్యక్తులూ, గ్రూపులూ, సంస్థలూ, పార్టీలు ఒకరితో మరొకరికున్న సంబంధాలనూ, వివిధవర్గాలకున్నటు వంటి సంబంధాన్ని దృష్టిలో వుంచుకొని అప్పటి భౌతిక పరిస్థితులనూ, భౌతిక పరిణామ విధానాన్ని సంపూర్ణమైన శాస్త్రీయ పరిశీలనగల అత్యద్భుత సంవిధానంలోనే యితర సోషలిస్టు సిద్ధాంతాలకూ, మార్క్సిజానికీ ఉన్న భేదం యిమిడివుంది.

అవకాశవాద పార్టీలకు ఎలాంటి కార్యాచరణ లేకుండా వుండటానికి, బూర్జువావర్గంతో పోరాడేందుకు నిరాకరించడాన్ని సమర్థించడానికి వారి "సిద్ధాంతాలు" వినియోగపడ్డాయి. ఇకముందుకూడా పడతాయి. లెనిన్, స్టాలిన్లు సిద్ధాంతాన్ని ఒక మూఢనమ్మకంగా గాక కార్మికవర్గ విముక్తి పోరాటంలోనూ, కమ్యూనిజం నిర్మాణంలోనూ ఒక మహత్తరమైన మార్గ దర్శిగా పరిగణిస్తారు.

లెనినిజం ముందుకు పురోగమించడానికి ఒకపిలుపు. అది పోరాటా లలోవచ్చే కష్టాలకు భయపడవద్దని బోధిస్తుంది. 'లెనిన్ - స్టాలిన్'ల సిద్ధాం తాల పతాకంక్రింద సోషలిజంకోసం జరిగే పోరాటంలో అనేకమంది వీరులు, స్వార్థరహితులై ప్రజాసేవకులు, సోషలిస్టు సమాజనిర్మాతలు ఉద్భవించారు. సోవియట్ ప్రజల దేశభక్తియుతమైన యుద్ధం 'స్టాలిన్‌గ్రాడ్ పోరాటం' లెనిన్‌గ్రాడ్ సెవాస్టోపూల్‌ల వీరోచిత రక్షణ, బెర్లిన్‌పై దాడి.

యివన్నీ సోవియట్ ప్రజలపై లెనినిజంయొక్క మహత్తర ప్రభావాన్ని తెలియపరుస్తాయి. లెనినిజమూ, సోషలిజంకోసం జరిగే పోరాటం యితర దేశాలలోకూడా లక్షలాది స్వార్థరహిత వీరులు తయారవడానికి కారణ భూతమయ్యాయి.

దానికెంత దురాక్రమణ తత్వమున్నా, అభివృద్ధి నిరోధక బూర్జువా వర్గం చారిత్ర్యాత్మకంగా తాను పతనం చెందుతానని తెలుకొనే ఉంది. దానిసిద్ధాంతం నిరాశాజనక భావంతో మిళితమై ఉంది.

బ్రిటిష్ లేబరు రాజకీయవేత్త హెరాల్డు నికల్సన్ 1948 సంవత్సర ఫలితాలనూ, 1949లో వున్న అవకాశాలనూ తాను వ్రాసిన నూతన సంవత్సర వ్యాసంలో సమీక్షచేస్తూ యిలా తెలియజేశాడు: జకోస్లోవికియా యింక మనకు లేకుండా పోయింది; డాన్యూబ్ నదిపోయింది; గ్రీస్, పాలిస్తీనా, మలయా, బర్మా, ఇండోనీషియాలలో అరాజకపరిస్థితు లున్నాయి; చైనా పూర్తిగా పోయినట్లే; మిత్రరాజ్యసమితి అప్రతిష్ఠ పాలయింది. రష్యా పాలన బహుశా దాదాపు ఎల్బినుండి యాంగ్ట్సీవరకు విస్తరించుతుంది. దీనితో పోల్చి చూసుకొంటే మన కేముందంటూ తన విచారాన్ని తెలియజేశాడు. పశ్చిమ యూనియన్ ఆర్థిక పునరుద్ధణకోసం కృషి – ఎన్నో యిక్కట్టులమధ్య యిదీ మనకున్నది...

ఎల్బినుండి యాంగ్ట్సీ వరకూ రష్యాపరిపాలన అన్నవిషయాన్ని నికల్సన్ ద్వేషాన్ని రెచ్చగొట్టాలన్న దురుద్దేశ్యంతో వ్రాశాడు. కాని సామ్రాజ్యవాదం పోగొట్టుకొన్న పలుకుబడిని గురించి అతడు వ్రాసినది నిజమే, ఖచ్చితంగా నిజమే. బూర్జువావర్గం యింకా ఆశపడటానికి కారణం కనపడదు. పెట్టుబడిదారి దుర్గాలన్నీ కూలిపోతున్నాయి. కాని సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులు, కమ్యూనిస్టు శక్తులూ ప్రతిచోటా వృద్ధిపొందుతున్నాయి. మనజీవితంలోని ఘటనలే లెనినిజంలోవున్న మహత్తర సత్యాన్ని ధృవపరుస్తున్నాయి. మనకాలంలో అన్నిమార్గాలూ కమ్యూనిజానికే చేరుకుంటాయి. ఈ మార్గాన్ని మార్క్సిజం – లెనినిజం అనే మహాసిద్ధాంతం ముందుగా చూడగలిగి ఆ మార్గానికి వెలుగును చూపెట్టింది.

— యఫ్. కాన్స్టాంటినోవ్
(కొమిన్ ఫారం పత్రిక నుండి)

# శ్రామికవర్గ నియంతృత్వం దాని అవసరం

— స్టాలిన్

ఈ శీర్షికక్రింద మూడు ప్రధాన విషయాలను పరిశీలిద్దాం.

(1) శ్రామికవర్గ నియంతృత్వం, శ్రామికవర్గ విప్లవానికి సాధనం. (2) బూర్జువావర్గంమీద శ్రామికవర్గ అధికారమే, శ్రామికవర్గ నియంతృత్వం. (3) శ్రామికవర్గ నియంతృత్వము యొక్క రాజ్యాంగరూపమే సోవియట్ రాజ్యాంగవిధానం.

## శ్రామికవర్గ నియంతృత్వం శ్రామికవర్గ విప్లవానికి సాధనం

శ్రామికవర్గ నియంతృత్వమంటే శ్రామికవర్గంయొక్క, విప్లవంయొక్క ముఖ్య సారాంశమన్నమాట. శ్రామిక నియంతృత్వంద్వారానే శ్రామికవిప్లవంయొక్క గతి, పరిమితి, విజయం నిర్ణయించబడతాయి. శ్రామికవర్గవిప్లవంయొక్క ముఖ్యసాధనం శ్రామికవర్గ నియంతృత్వం. కూలద్రోయబడిన దోపిడీవర్గ దాడిని ఎదుర్కొని అణచివేయుటకు, శ్రామికవర్గ విప్లవవిజయాలను సుస్థిరంచేయుటకు శ్రామికవర్గ విప్లవాన్ని తుదివరకూ నడిపి, సంపూర్ణమైన సోషలిస్టు విజయాన్ని సాధించుటకు శ్రామివర్గ నియంతృత్వం ప్రధానమైన ఆయుధం. శ్రామికవర్గ నియంతృత్వం స్థాపించకముందే, విప్లవశక్తులు బూర్జువావర్గాన్ని ఓడించి, వారి అధికారాన్ని నాశనం చేయగలవు. కాని బూర్జువావర్గం యొక్క ప్రతిరోధకశక్తిని అణచివేసి, సాధించిన విజయాన్ని నిలబెట్టుకొని, ముందుకు సాగిపోయి, సోషలిజాన్ని స్థాపించుటకు విప్లవశక్తులకు సాధ్యపడదు. ఈ పనులనుచేయుటకు, విప్లవంలో ఒక దశయందు శ్రామికవర్గ నియంతృత్వ మను ఒక ప్రత్యేక నిర్మాణాన్ని నెలకొల్పితీరాలి.

"విప్లవంయొక్క ప్రధాన సమస్య అధికార సమస్యయే" అన్నాడు లెనిన్. అయితే కర్తవ్యమంతా అధికారాన్ని లాక్కొనుటయేనా? కాదు. అధికారాన్ని స్వాధీనపరచుకొనుట ప్రారంభంలో చేయవలసిన పని. స్వాధీనంచేసుకున్న తరువాత కూడా చాలాకాలంవరకూ అనేక కారణాల వల్ల, బూర్జువావర్గం తనను కూలద్రోసిన శ్రామికవర్గంకంటె బలంగా ఉంటుంది. అందువల్ల సంపాదించిన అధికారాన్ని నిలబెట్టుకొని, కేంద్రీకరించి, అజేయమైన శక్తిగా తయారుచేయుటయే ముఖ్యమైన కర్తవ్యం. ఈ కర్తవ్యాన్ని ఎలా నెరవేర్చేది? విజయం

పొందిన మరుక్షణమే శ్రామికవర్గాన్ని ఎదుర్కొనే ఈక్రింది మూడు కర్తవ్యాలను నెరవేర్చినయెడల, విజయాన్ని నిలబెట్టుకోవచ్చు.

— విప్లవంలో కూలద్రోయబడిన భూస్వాములయొక్క, పెట్టుబడిదారుల యొక్క నిరోధమును భగ్నంచేసి, తిరిగి తమ పెట్టుబడి అధికారాన్ని తెచ్చుటకై వారుచేసే ప్రతి ప్రయత్నాన్ని భగ్నం చేయాలి.

— కష్టజీవు లందరినీ శ్రామికవర్గం చుట్టూ సమీకరించే పంథాలో పునర్నిర్మాణం ప్రారంభించి, చివరికి వర్గములను నిర్మూలించే ఆశయంతో కార్యక్రమాన్ని కొనసాగించాలి.

— విప్లవశక్తులకు ఆయుధాలిచ్చి, విదేశ శత్రువులతోనూ, సామ్రాజ్యవాదులతోనూ పోరాడుటకై విప్లవ సైన్యాన్ని నిర్మించాలి.

పై మూడు కర్తవ్యాలను నెరవేర్చుటకు శ్రామికవర్గ నియంతృత్వం అవసరం.

“పెట్టుబడి విధానమునకు, కమ్యూనిజంకు మధ్యకాలం ఒక చరిత్రాత్మకమైన దశ. ఈ దశ సమాప్తి అయేవరకూ, దోపిడీ వర్గాలు తిరిగి తమ అధికారాన్ని నెలకొల్పవచ్చుననే ఆశతో ఉండి, ప్రయత్నాలు కూడా చేస్తారు. తాము కూలద్రోయబడుట అసంభవమనీ, అది ఎన్నడూ జరగదని తలచి అటువంటి ఆలోచనకు కూడా అవకాశమివ్వని బూర్జువా వర్గం కూలద్రోయబడి గట్టిగా దెబ్బతిన్న వెంటనే పూర్వంకంటె, 10 రెట్లు ఎక్కువ శక్తితో, 100 రెట్లు అధికమయిన ద్వేషం, ఉద్రేకములతో తాము, తమ కుటుంబాలు హాయిగా అనుభవించిన సుఖ జీవితంతో కూడిన “స్వర్గరాజ్యాన్ని” తిరిగి స్థాపించుటకు ముందుకు దుముకుతారు. బూర్జువావర్గ పక్షంతో, ఛోటా బూర్జువావర్గానికి చెందిన ప్రజాసామాన్యంకూడా కలుస్తుంది. ఈ ఛోటా బూర్జువా వర్గం ఎప్పుడూ సందేహిస్తూ, మధ్య ఊగులాడుతూ, ఒకరోజున శ్రామికవర్గం వెనుకను, మరో రోజున విప్లవంలోని కష్టాలకు భయపడి పారిపోవటం జరుగుతుంది. కార్మికులు ఒకవేళ మొదటిసారి ఓడిపోతే, ఈఛోటా బూర్జువా వర్గం భయోత్పాతంతో బీభత్సమయి, నిరుత్సాహపడి దారి, డొంక తెలియక ఒకపక్షంనుంచి, మరొకపక్షంలోకి పరుగెత్తుతారని ప్రతిదేశ చరిత్రవల్ల గడించిన అనుభవం తెలియజేస్తుంది.

(లెనిన్ సెలెక్టెడ్ వర్క్స్–7వ సంపుటం 149-41 వ పేజీ)

తిరిగి తమ అధికారాన్ని నెలకొల్పే ప్రయత్నంచేయుటకు బూర్జువావర్గానికి ఆధారంలేక పోలేదు. కూలద్రోయబడిన తరువాతకూడా బూర్జువావర్గం చాలాకాలంవరకూ, తన్ను కూలద్రోసిన శ్రామికవర్గంకంటె బలంగా ఉండుటయే దీనికి కారణం.

"మామూలుగా జరిగేదేమంటే : బూర్జువావర్గం ఏదో ఒకదేశంలోమాత్రమే కూలద్రోయబడుతుంది. అనేక దేశాల్లో ఒకేసారి విప్లవం వచ్చుట, సాధారణంగా జరుగని విషయం. అందువల్ల మొత్తం మీద పీడితప్రజలకంటె పీడించే బూర్జువా వర్గానికే బలం ఎక్కువగా ఉంటుంది".

(లెనిన్ సెలెక్టెడ్‌వర్క్సు-7 వ సంపుటం, 140 వ పేజీ)

అయితే కూలద్రోయబడిన బూర్జువావర్గం యొక్క శక్తియొక్క ఆధారం ఏమిటి?

1. "అంతర్జాతీయ పెట్టుబడిదారుల శక్తిమీద, బూర్జువా వర్గానికిగల అంతర్జాతీయ సంబంధాల బలంమీద" ఆధారపడి ఉన్నది.

(లెనిన్ : సెలెక్టెడ్‌వర్క్సు-10 సంపుటం, 60 వ పేజీ)

2. "విప్లవం జరిగిన తరువాత కూడా, దోపిడిగాండ్రకు అనేక ప్రత్యేక సౌకర్యాలు ఉంటాయి : ఇంకా వారివద్ద ధనం ఉంటుంది. (అమాంతంగా ఒకేసారి డబ్బంతా లాక్కొనుట అసంభవం గనుక.) కొంత చరాస్థి ఉంటుంది. ఇంకా అనేకరకాల సంబంధాలు, నిర్మాణపు అలవాట్లు, యజమానుల సాంప్రదాయాలు, నిర్మాణ రహస్యాలు (అలవాట్లు, పద్ధతులు, సాధనాలు) విద్యాధిక్యత, బూర్జువా వర్గ ఆలోచనలుగల గొప్ప టెక్నికల్ నిపుణులతో (ఇంజనీయర్లు, డాక్టర్లు మొదలైనవారు) దగ్గర సంబంధాలు, అన్నిటికంటె ముఖ్యమైన యుద్ధనిర్వాహణలో మహత్తరమైన అనుభవం మొదలైనవన్నీ ఓడిపోయిన బూర్జువా వర్గానికి ఉంటాయి."

(లెనిన్ : సెలెక్టెడ్‌వర్క్సు-7 వ సంపుటం 140 వ పేజీ)

3. "సాంప్రదాయక అలవాట్లు, కొద్దిపాటి స్కేలుపై ఉత్పత్తి" పద్ధతులు సాధారణంగా బూర్జువావర్గ బలాన్ని ఎక్కువ చేస్తాయి. దురదృష్టవశాత్తుగా ప్రపంచంలో ఈనాడుకూడా "కొద్దిపాటి స్కేలుపై ఉత్పత్తి" పద్ధతులు విరివిగా వ్యాపించి ఉన్నాయి. "కొద్దిపాటి ఉత్పత్తి" విధానంవల్ల ప్రతిరోజూ, ప్రతిగంట, ప్రతిక్షణమూ బాహుళ్యంగా పెట్టుబడివిధానం, బూర్జువావర్గం బలపడుతాయి. వర్గరహితం చేయుట అంటే

భూస్వాములను, పెట్టుబడిదారులను కూలద్రోయుటయే కాదు; అది సులభంగానే చేయగలం. వర్గరహిత సమాజాన్ని స్థాపించుటకు, కొద్దిపాటి సరుకులను ఉత్పత్తిచేయు చిన్నచిన్న ఉత్పత్తిదారులను గూడా లేకుండా చేయాలి. కాని ఈ చిన్న చిన్న వాళ్ళను కూలద్రోయుటకు వీలు లేదు. వారిని అణచివేయుటకు గూడా వీలులేదు. వారితో సామరస్యం కలిగి ఉండుట అవసరం. నెమ్మదిగా, జాగ్రత్తగా మెలకువతో చక్కటి నిర్మాణ కార్యక్రమంద్వారా, దీర్ఘకాలంమీద వారిని విజ్ఞానవంతులనుచేసి నూతన వ్యక్తులుగా తయారగునట్లు పోతపొయ్యాలి.”

(లెనిన్ : సెలెక్టెడ్‌వర్క్స్-10వ సంపుటం 60, 83 పేజీలు)

అందువల్లనే లెనిన్ ఇలా అన్నాడు :

“శ్రామికవర్గనియంతృత్వమంటే, కూలద్రోయబడి పూర్వకంటె 10 రెట్లుఎక్కువ బలం కలిగిన బూర్జువావర్గంతో, నూతనవర్గం సాగించే తీవ్ర భయంకర పోరాటమన్నమాట. రక్తపాతంతోనూ, రక్తపాతం లేకుండానూ, బలప్రయోగంతోనూ, శాంతి పద్ధతులలోనూ, మిలటరీ వ్యవహారాల్లోనూ, ఆర్థిక విషయాల్లో, రాజ్యాంగ, విద్యావిషయాల్లో పాతసామాజిక సాంప్రదాయశక్తులకు వ్యతిరేకంగా చేయవలసిన ఎడతెగని పోరాటమే శ్రామికవర్గ నియంతృత్వం”.

(లెనిన్: సెలెక్టెడ్‌వర్క్స్: 10వ సంపుటం 60, 84 పేజీలు)

ఈ కర్తవ్యాలన్నింటినీ కొద్దికాలంలో నెరవేర్చుటకు అవకాశంలేదని వేరుగా చెప్పనక్కరలేదు. అందువల్ల శ్రామిక నియంతృత్వదశ, ఏదో ఒక తాత్కాలిక క్షణభంగురమైన దశకాదు. ఏవో కొన్ని అతీత విప్లవకార్యాలను, ఆర్డర్లను జారీచేసే కాలంకాదు ఇది. అంతర్యుద్ధాలతో, విదేశాలతో చేయవలసిన పోరాటాలతో, ఎడతెగకుండా నిర్మాణ కార్యక్రమాన్ని, ఆర్థిక పునర్నిర్మాణాన్ని సాగిస్తూ, తిరోగమన, పురోగమనములతో, జయాపజయాలతో నిండియున్న ఒక సంపూర్ణమైన చారిత్రకదశ ఇది. సంపూర్ణ సోషలిస్టు విజయానికి అవసరమైన ఆర్థిక సాంస్కృతిక సంస్థలను నిర్మించుటయేగాక, శ్రామికవర్గమే విజ్ఞానం పొంది, ప్రభుత్వ యంత్రాన్ని నడుపగల శక్తిసామర్థ్యములను శిక్షణపొందుటకూ, ఛోటాబూర్జువా వర్గానికి చెందినవారికి నూతన చైతన్యమును కల్గించు సోషలిస్టు ఉత్పత్తి విధానం సాధ్యపడునట్లు చేయుటకూ – ఈ చారిత్రిక దశ అవసరం.

కార్మికులతో మార్క్స ఈవిధంగా చెప్పాడు—

“ప్రస్తుత పరిస్థితులను మార్చుటకేగాక, రాజకీయ అధికారాన్ని నిర్వహించేశక్తిని మీరు సంపాదించుటకై, మీరందరూ 15, 20 లేక 50 సంవత్సరాలపాటు అంతర్యుద్ధాలను, అంతర్జాతీయ పోరాటాలను దాటిపోవలసి యున్నది.”

మార్క్స భావాన్ని ఇంకొంత అభివృద్ధి చేస్తూ లెనిన్ ఈ క్రింది విధంగా చెప్పారు :

"శ్రామికవర్గ నియంతృత్వం క్రింద, అసంఖ్యాకులయిన రైతులకూ, చిన్న చిన్న వ్యవసాయదార్లకూ, వేలకువేలుగా ఉన్న ఆఫీసు గుమాస్తాలకు, ఉద్యోగులకు, బూర్జువా మేధావులకు తిరిగి విద్యచెప్పి, వారినందరిని శ్రామికవర్గ రాజ్యాన్ని, శ్రామికవర్గ నాయకత్వాన్ని అంగీకరించునట్లు చేయాలి. వారి బూర్జువా సాంప్రదాయాలను, అలవాట్లను పోగొట్టాలి. అదేవిధంగా శ్రామికవర్గ నియంతృత్వాన్ని ఆధారం చేసుకొని, శ్రామికులకే తిరిగి విద్యచెప్పి వారి ఛోటాబూర్జువా అపోహాలను రద్దు కావించాలి. అమాంతంగా ఒక ఆజ్ఞ ఇచ్చినంతమాత్రాన కార్మికుల పూర్వ భావాలు మటుమాయమైపోవు. ఛోటాబూర్జువా ప్రభావాలకు, వ్యతిరేకంగా కష్టతరమైన దీర్ఘ పోరాటం సాగించినప్పుడే యీ ఫలితాలు వస్తాయి."

(లెనిన్ : సెలెక్టెడ్ వర్క్సు: 10వ సంపుటం 156, 157 పేజీలు)

## బూర్జువావర్గంమీద శ్రామికవర్గ అధికారమే శ్రామికవర్గ నియంతృత్వం

శ్రామికవర్గ నియంతృత్వమంటే, పూర్వ రాజకీయ విధానమంతా చెక్కుచెదరకుండా అలాగేవుండి, కేవలం ప్రభుత్వ అధికారులలో మార్పుకలిగి, మంత్రివర్గాలు మారుటకాదని పైన చెప్పబడిన విషయాలనుబట్టి తెలుస్తుంది. శ్రామికవర్గ నియంతృత్వమంటే భయపడే మెన్షివిక్కులు, అన్ని దేశాల్లోని ఇతర అవకాశవాదులూ, "శ్రామికవర్గనియంతృత్వానికి" బదులుగా "అధికార సంపాదన" కావాలని చెబుతూ, అధికారసంపాదనయొక్క అర్థాన్ని కూడా తగ్గించి మంత్రివర్గంలో మార్పురావాలని, షైడేమాన్, నోస్కే, మాక్‌డొనాల్డు, హెండర్‌సన్ మొదలగు అవకాశవాదులైన విద్రోహులతోకూడిన మంత్రివర్గాలు అధికారములో ఉండాలంటారు. ఇటువంటి మంత్రివర్గాలకు, శ్రామికవర్గ నియంతృత్వానికి, శ్రామికవర్గం లాక్కొనే నిజమైన అధికారానికీ, ఈద్రోహుల అధికార సంపాదనకు ఎక్కడా పోలికలేదని వేరుగా చెప్పనక్కరలేదు. పాత బూర్జువా విధానం అలాగే ఉన్నప్పుడు ఏర్పడే ఈమాక్డొనాల్డు, షైడేమాన్లతోకూడిన మంత్రివర్గాలు, వారి ప్రభుత్వాలు సామ్రాజ్యవాదుల కుట్లనంతా మరుగుపరచి, పీడితప్రజల విప్లవోద్యమాలను అణచివేయుటకు బూర్జువావర్గానికి సాధనాలుగా ఉపయోగపడే యంత్రాలు మాత్రమే. ఏదో ఒకటి అడ్డుపెట్టుకొని తెరచాటునుంచి బూర్జువావర్గం ప్రజలను దోపిడీచేయుటకు, కష్టతరమైన పరిస్థితులలో బూర్జువావర్గానికి, ఇటువంటి కీలుబొమ్మ ప్రభుత్వాలు అవసరమవుతాయి. కాని ఇటువంటి ప్రభుత్వాలు ఏర్పడుటవల్ల, పెట్టుబడి విధానస్థితి సరిగా లేదనే విషయం బోధపడుతుంది. ఈరకం ప్రభుత్వాలన్నీ మారువేషం వేసుకొన్న పెట్టుబడిదారుల ప్రభుత్వాలేకాని వేరుగావు. భూమికి ఆకాశానికి ఎంత ఎడం ఉన్నదో శ్రామికవర్గ నియంతృత్వానికి, మాక్డొనాల్డు

పైడేమాన్ల ప్రభుత్వానికి అంత వ్యత్యాసం ఉంది.

శ్రామికవర్గ నియంతృత్వ మంటే కేవలం ఒక ప్రభుత్వపు మార్పు కాదు. నూతన స్థానిక, కేంద్ర, అధికార సంస్థలతో కూడిన ఒక నూతన రాజ్యాంగయంత్రం అది. శిథిలమైన బూర్జువావర్గ రాజ్యాంగ యంత్ర స్థానంలో నెలకొల్పబడిన శ్రామికవర్గ రాజ్యం అది.

బూర్జువా విధానాన్ని ఆధారంచేసుకొని నెలకొల్పబడేదికాదు - శ్రామికవర్గ నియంతృత్వం. బూర్జువావర్గాన్ని కూలద్రోసిన తరువాత, పాతవిధానం శిథిలమవుతున్నప్పుడు భూస్వాములయొక్క, పెట్టుబడిదార్లయొక్క ఆస్తులను స్వాధీనపరచుకొనే సమయంలో ముఖ్యమైన ఉత్పత్తి సాధనాలను సమాజపరం చేయునప్పుడు, తీవ్రంగా శ్రామిక విప్లవం ముందుకు సాగిపోయే కాలంలో, శ్రామికవర్గ నియంతృత్వం నెలకొల్పబడుతుంది. బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా ఉపయోగించబడే బలప్రయోగాన్ని ఆధారంచేసుకొని నిర్మించబడే విప్లవశక్తియే శ్రామిక నియంతృత్వం.

తన్ను ఎదిరించే వర్గశత్రువులను అణచివేయుటకు పాలక వర్గానికి ఉపయోగపడే సాధనమే రాజ్యాంగ యంత్రం. ఈ విషయంలో మాత్రం, ఇతర వర్గాల నియంతృత్వాలకు కార్మిక వర్గ నియంతృత్వానికి పెద్దగా భేదంలేదు. ఎందుకంటే బూర్జువా వర్గాన్ని అణచివేయుటయే శ్రామికవర్గ నియంతృత్వ రాజ్యాంగ యంత్రంయొక్క ప్రధాన ఆశయం. కాని ఒక ప్రధానభేదం ఉన్నది. ఇంతవరకూ అమలులో ఉన్న వర్గరాజ్యాంగ యంత్రాలు ఏవరో కొద్దిమంది దోపిడిగాండ్రు అధికసంఖ్యాకులైన పీడిత ప్రజాసామాన్యాన్ని దోచుకొనుటకు వినియోగించబడినాయి. ఇక శ్రామిక నియంతృత్వమో? అధికసంఖ్యాకులైన పీడితవర్గం దోపిడిచేసే కొద్దిమందిని అణిచివేయుటయే శ్రామికవర్గ నియంతృత్వ ఉద్దేశ్యం.

క్లుప్తంగా చెప్పాలంటే:

బలప్రయోగంమీద ఆధారపడి "హద్దులులేకుండా, బూర్జువావర్గంమీద సాగించే పరిపాలనయే శ్రామిక నియంతృత్వం. కష్టజీవులందరూ, పీడిత ప్రజలందరూ, సహాయసానుభూతులతో ఈ పరిపాలనను బలపరుస్తారు. (లెనిన్ వ్రాసిన రాజ్యాంగయంత్ర విప్లవం" అను గ్రంథంచూడండి).

పై విషయాలనుబట్టి రెండు సారాంశాలు తెలుతాయి.

(1) ధనికులకు, పేదలకు అందరికీ వర్తించే సంపూర్ణ ప్రజాస్వామికం కాదు శ్రామిక నియంతృత్వం. శ్రామిక నియంతృత్వం సర్వసామాన్యంగా శ్రామికులకూ పేదలకందరికీ వర్తిస్తూ, బూర్జువావర్గానికి వ్యతిరేక

నైన ఒక నూతన ప్రజాస్వామ్య ప్రభుత్వం, (లెనిన్: సెలెక్టెడ్ వర్క్స్. 7 సంపుటం. 34 వ పేజీ). దోపిడీవర్గానికి, పీడించబడే జన సామాన్యమునకు మధ్య సమానత్వం ఏర్పడుట అసంభవమనే వాస్తవిక విషయాన్ని మరుగుపరచుటకై, కాట్స్కీ కంపెనీవారు 'సార్వజనిక సమానత్వమని', 'సంపూర్ణ ప్రజాస్వామ్య' మని కబుర్లు చెప్తారు. ఇవన్నీ బూర్జువావర్గానికి లాభకరమైన నినాదాలు. కార్మిక వర్గాన్ని చీలదీసి అందులో పైభాగమునకు చెందినవారికి మేతపెట్టి సామ్రాజ్యవాదదొంగలు ఇటువంటి 'సంపూర్ణ ప్రజాస్వామ్య' సిద్ధాంతాలను లేవదీస్తారు. పెట్టుబడి విధానంలోని కుళ్ళు నంతా కప్పిపెట్టి, సామ్రాజ్యవాదమును నిలబెట్టి, పీడితప్రజలకు వ్యతిరేకంగా సాగించే పోరాటమునకు, నైతిక బలాన్ని సంపాదించుటకు ఈ నినాదాలు లేవనీయబడుతున్నాయి. పెట్టుబడివిధానంక్రింద పీడితప్రజలకు నిజమైన స్వాతంత్ర్య హక్కులు ఉండవు. ఉండుట అసంభవం. ఎందుకంటే ఆ హక్కులను అనుభవించుటకు ఆగత్యమైన ప్రదేశాలు, అచ్చుయంత్రాలు, కాగితపు సప్లయిలన్నీ దోపిడిగాండ్ర ప్రత్యేక హక్కులై ఉండుటయే దీనికి కారణం. పెట్టుబడి విధానం క్రింద దేశ రాజ్యాంగ వ్యవహారాల్లో ప్రజలు పాల్గొనుటకు హక్కు ఉండుట అసంభవం. ఎందుకనగా పెట్టుబడి విధానంలో యెంత గొప్ప 'ప్రజాస్వామ్య' ప్రభుత్వమైనా అది ప్రజల కొరకు గాక, రాత్‌షైల్డ్, స్టినెస్, రాక్‌ఫెల్లర్, మార్గన్ మొదలగు కోటీశ్వరుల ప్రయోజనములకై నెలకొల్పబడుతుంది. పెట్టుబడి విధానం క్రింద ఉండే ప్రజాస్వామ్య ప్రభుత్వాలన్నీ పెట్టుబడిదారీ ప్రజాస్వామ్య ప్రభుత్వాలే. అధికసంఖ్యాకులైన పీడిత ప్రజాస్వామ్య హక్కులను సంకుచితపరచి, దోపిడీచేసే అల్పసంఖ్యాకులకు వర్తించే ప్రజాస్వామ్యాలు అవి. ఒక్క శ్రామికవర్గ నియంతృత్వం క్రిందనే, అన్ని స్వాతంత్ర్య హక్కులు గ్యారంటీ చేయబడి పీడిత ప్రజలందరూ దేశ రాజ్యాంగ వ్యవహారాల్లో పాల్గొన కల్గుతారు. శ్రామిక నియంతృత్వం పరిపాలనా విధానంలో ఉండే ప్రజాస్వామికం - శ్రామిక వర్గ ప్రజాస్వామికం. అధిక సంఖ్యాకులైన పీడితప్రజల ప్రజాస్వామికమిది. అల్పసంఖ్యాకులైన దోపిడీవర్గంయొక్క హక్కులను సంకుచితపరచి వారికి

వ్యతిరేకంగా పరిపాలన సాగించే ప్రజాస్వామ్యమే, శ్రామికవర్గ ప్రజాస్వామికం.

2. శాంతియుతంగా బూర్జువా సమాజం అభివృద్ధి అయిన ఫలితంగా శ్రామికవర్గ నియంతృత్వం ఏర్పడదు. బూర్జువా రాజ్యాంగ యంత్రాన్ని, బూర్జువా సైన్యాన్ని, బూర్జువా అధికారవర్గాన్ని, బూర్జువా పోలీసు దళాన్ని నాశనంచేసిన ఫలితంగా శ్రామికనియంతృత్వం తలఎత్తుతుంది.

'కమ్యూనిస్టు మానిఫెస్టో' ఉపోద్ఘాతంలో మార్క్సు, ఎంగిల్సులు ఈ విషయాన్ని నొక్కి చెప్పారు:

"తయారుగావున్న రాజ్యాంగ యంత్రాన్ని (బూర్జువా), కార్మిక వర్గం తమ ప్రయోజనాల కొరకు ఉపయోగించుటకు వీలులేదు."

1871 లో క్యూగెల్ మాన్‌కు వ్రాసిన లేఖలో శ్రామికవర్గవిప్లవ కర్తవ్యాన్నిగురించి మార్క్సు ఈ క్రింది విధంగా వ్రాశాడు:

"పూర్వంవలె రాజ్యాంగ మిలిటరీ యంత్రాన్ని ఒకరి చేతుల్లోంచి మరొకరి చేతుల్లోకి మార్చుటగాక, దాన్ని పూర్తిగా నాశనము చేయుట ప్రధాన కర్తవ్యమై యున్నది. యూరపుఖండ దేశాల్లోని నిజమైన ప్రజావిప్లవాల ప్రథమ కర్తవ్యం ఇది."

యూరపుఖండ దేశాలనుగురించి మాత్రం మార్క్సు ఈవిధంగా చెప్పాడని, అందువల్ల యూరపుఖండానికి బయట ఉన్న దేశాల్లో (ఇంగ్లండు, అమెరికా) బూర్జువా ప్రజాస్వామ్యం శాంతియుతంగా పరిణామంచెంది శ్రామికవర్గ ప్రజాస్వామికంగా మారుటకు అవకాశం ఉన్నదనే భావాన్ని మెన్షివిక్కులు మొదలైన అవకాశవాదులు లేవదీశారు! మార్క్సు ఇంగ్లండు అమెరికాల విషయాన్ని ఎత్తుకొనకపోవుటకు కారణములు లేకపోలేదు. 1870 నాటికి ఇంగ్లండు అమెరికాలలో గుత్తపెట్టుబడి విధానం, సామ్రాజ్యవాదమూ అభివృద్ధి పొందలేదు. అందువల్ల అక్కడి ప్రత్యేక పరిస్థితులనుబట్టి ఆదేశాలలో అభివృద్ధి అయిన మిలిటరీవిధానం, అధికారవర్గాలు ఏర్పడలేదు. సామ్రాజ్యవాదం అభివృద్ధిచెందని రోజులు అవి. కాని తరువాత 30, 40 సంవత్సరాలు గడిచిన తరువాత ఆదేశాల్లో పరిస్థితులు పూర్తిగా మారిపోయి, సామ్రాజ్యవాదం అభివృద్ధి అయి, అన్నిపెట్టుబడిదేశాలను ఆవరించుకొనిపోయినప్పుడు, మిలటరీ అధికార వర్గాలు ఇంగ్లండు, అమెరికాలలోగూడా బయలుదేరినప్పుడు శాంతియుత విప్లవాలకు అవకాశం లేకుండా పోయింది. ఈ నూతన పరిస్థితులలో, పైన చెప్పబడిన మినహాయింపు వర్తించుటకు వీలుండదు.

లెనిన్ ఈ విషయాన్ని గురించి చెప్పిన మాటలు :—

"ఈ నాడు 1917 లో, మొదటి సామ్రాజ్యవాద యుద్ధకాలంలో మార్క్సు సూచించిన మినహాయింపు వర్తించదు. ఆంగ్లో-శాక్సన్ స్వాతంత్ర్య సాంప్రదాయంగలదేశాలలో, చివరి గొప్ప దేశములైన ఇంగ్లండు అమెరికాలలో ఒకప్పుడు మిలటరీ అధికారవర్గాలు లేని మాట నిజమే. కాని ఈ దేశాలలోకూడా ఈనాడు యూరపియన్ దేశాల్లోని హింసాయుతమై నటువంటి, హేయమై నటువంటి, అధికార మిలటరీ సంస్థలు బయలుదేరినాయి. ఈసంస్థల క్రింద

దేశాలూ, ప్రజలు అన్నీ అణగద్రొక్క-బడుతున్నాయి. ఈ రోజు ఇంగ్లండు, అమెరికాలలో వచ్చే ప్రజావిప్లవముల యొక్క ప్రథమకర్తవ్యం ఏమిటంటే అదివరకున్న రాజ్యాంగయంత్రాన్ని సర్వ నాశనం చేయుటయే. 1914, 1917 మధ్యలో ఇంగ్లండు, అమెరికాదేశాల్లోని రాజ్యాంగ యంత్రాలు యూరపులోని సామ్రాజ్యవాద రాజ్యాంగ యంత్రము లతో సమానంగా అభివృద్ధి అయినదని చెప్పవచ్చును."

(లెనిన్: సెలెక్టెడ్ వర్క్సు, 7 వ సంపుటం 37 వ పేజీ)

అవగా సామ్రాజ్యవాద దేశాల్లోని విప్ల వోద్యమంయొక్క ప్రథమ సూత్రం ఏమంటే బూర్జువా రాజ్యాంగయంత్రాన్ని బలప్రయోగంతో నాశనంచేయాలి. అప్పుడు శ్రామిక వర్గ విప్లవానికి అవకాశం కలుగుతుంది. ఇదే శ్రామిక విప్లవంయొక్క ప్రధాన సూత్రం.

ముఖ్యమైన పెట్టుబడి దేశాల్లో శ్రామిక వర్గం విజయాలను సాధించినప్పుడు, ప్రస్తుత పెట్టుబడిదారుల ముట్టడి స్థానే సోషలిస్టు విధానం ప్రపంచాన్ని ఆక్రమించుకొన్నప్పుడు ముందు ఎప్పుడో భవిష్యత్తులో, కొన్ని దేశాల్లో శాంతియుతమైన పరిణామం రావచ్చును. ఎందుకంటే, అప్పటి అంతర్జాతీయ పరిస్థితులు తమకు అనుకూలంగా లేక పోవుట గ్రహించి ఆ దేశాల్లోని పెట్టుబడి దారులు తమంతట తామే కార్మికవర్గాలకు ముఖ్యమైన హక్కులను ఇచ్చుటకు తయా రవుతారు. కాని ఇది ఎప్పుడో భవిష్యత్తులో జరిగే విషయం అనేది మరచిపోరాదు. వెంటనే జరుగవలసిన విషయాన్ని గురించి ఇటువంటి అభిప్రాయం కలిగిఉండుట తప్పు.

అందువల్లనే లెనిన్ సరిగా చెప్పాడు:—

"బూర్జువా రాజ్యాంగ యంత్రాన్ని బలప్రయోగంతో నాశనముచేయకుండా, దాని స్థానే మరొక నూతన రాజ్యాంగమును నిర్మించకుండా శ్రామికవర్గవిప్లవం అసంభవం."

(లెనిన్ సెలెక్టెడ్ వర్క్సు 7 వ సంపుటం 124 వ పేజీ)

## శ్రామికవర్గ నియంతృత్వముయొక్క రాజ్యాంగరూపమే సోవియట్ రాజ్యాంగ విధానం

శ్రామిక నియంతృత్వ విజయమంటే, బూర్జువా రాజ్యాంగ యంత్రం నాశనం చేయ బడి, బూర్జువా వర్గం అణచివేయబడి, బూర్జువా ప్రజాస్వామ్యానికి బదులు శ్రామిక ప్రజాస్వామ్యం నెలకొల్పబడుట అనే విషయం బాగా స్పష్టపడింది. కాని ఈ మహత్తర కర్తవ్యాన్ని శ్రామికవర్గం ఏయే నిర్మాణసాధనములతో నెరవేర్చగల్గుతుంది? బూర్జువా శాసనసభా పద్ధతులలో పెరిగిన పాతశ్రామికవర్గ నిర్మాణం, ఈ కర్తవ్యనిర్వహణకు పనికిరాదని నిస్సందేహముగా చెప్పవచ్చును. అయితే ఏయే కొత్తనిర్మాణ పద్ధతులవల్ల శ్రామికవర్గం బూర్జువారాజ్యాంగ యంత్రాన్ని పూడ్చిపెట్టి, బూర్జువా ప్రజా స్వామ్యం స్థానే శ్రామిక ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పి, శ్రామిక సోవియట్ రాజ్యాంగా నికి పునాది వేయగలదు.

శ్రామికవర్గంయొక్క ఈ నూతన నిర్మాణ రూపమే సోవియట్లు.

పూర్వపు నిర్మాణరూపములలో లేనిబలం సోవియట్లకు ఎక్కడనుంచి వస్తోంది?

కార్మికులందరినీ కూడగట్టుకొని (మినహాయింపులు లేకుండా) ఏర్పడే శ్రామిక ప్రజా సంఘాలే సోవియట్లు.

కార్మికులు, రైతులు, సైనికులు, నావికులు మొదలైన పీడితప్రజలందరితో కూడిన ప్రజా సంఘాలే సోవియట్లు. అందువల్ల ప్రజలందరికీ పురోగామి అయిన శ్రామికవర్గం ప్రజాపోరాటంలో రాజకీయ నాయకత్వమును వహించ గలుగుతుంది.

ప్రజలయొక్క విప్లవపోరాటాలకు, రాజకీయ కార్యాలకు, తిరుగుబాట్లకు సోవియట్లు శక్తివంతమైన సాధనాలు. పెట్టుబడిదారుల సర్వాధిపత్యాన్ని, వారి రాజకీయ ఉపాంగములను భగ్నం చేయగలసంస్థలు ఇవి.

ప్రజలు తమంతటతాము నిర్మించుకొన్న ప్రజాసంఘాలే సోవియట్లు. అందువల్ల ఇతర సంస్థలన్నిటికంటె ఎక్కువ ప్రజాస్వామ్య స్వభావంకల్గి, నూతన రాజ్యాంగ నిర్మాణ వ్యవహారాల్లో ప్రజలందరూ పూర్తిగాపాల్గొనుటకు వీలుగావుంటాయి. తమ విప్లవశక్తినంతా వినియోగించి ప్రజలందరూ, పాత సామాజిక విధానాన్ని నిర్మూలించి నూతన శ్రామిక విధానాన్ని నెలకొల్పుటకుగూడా సోవియట్లు చక్కని సాధనాలుగా తోడ్పడగలవు.

స్థానిక సోవియట్లన్నీకలిసి ఏర్పడిన కేంద్ర రాజ్యాంగ నిర్మాణమే సోవియట్ రాజ్యాంగ శక్తి. ఈ విధంగా నిర్మించబడిన సోవియట్ ప్రజాస్వామ్య రాజ్యాంగములో శ్రామిక వర్గం పాలకవర్గంగా ఉండి, పీడిత ప్రజా సామాన్యమున కంతకూ నాయకత్వం వహిస్తుంది.

"సోవియట్లన్నీ నాటికి నూరువంతులు ప్రజాసంస్థలు. ఇదే సోవియట్ రాజ్యాంగములోని ప్రధానవిశేషం. పూర్వం ఒకప్పుడు పెట్టుబడిదారులక్రింద భూస్వాములక్రింద క్రుగ్గిపోయిన వర్గాలతో ఇప్పుడు ఈ విప్లవసంస్థలయిన సోవియట్లు ఏర్పడి శాశ్వత రాజ్యాంగ యూనిట్లుగా ఉంటున్నాయి. పూర్వం గొప్ప గొప్ప బూర్జువా ప్రజాస్వామ్య ప్రభుత్వాలక్రింద గూడా న్యాయదృష్టిలో అందరూ సమానమైనా - ప్రత్యక్షంగా ఆచరణలో రాజకీయాలలో పాల్గొనకుండా ప్రజాస్వామ్య స్వాతంత్ర్య హక్కులను అనుభవించుటకు వీలులేకుండా వెయ్యిరకాల దొంగ ఎత్తుల ద్వారా నిరోధించబడినప్రజాసామాన్యమే ఇప్పుడు తప్పనిసరిగా ప్రజా స్వామ్య రాజ్యాంగవ్యవహారాల్లో పాల్గొనుటకు ఆధారం ఈ సోవియట్లే."

(లెనిన్ సెలెక్టెడ్‌వర్క్స్ 7 వ సంపుటం 281 వ పేజీ)

అందువల్ల సోవియట్ రాజ్యాంగం, ఒక నూతన రాజ్యాంగ నిర్మాణరూపం. పాత బూర్జువా ప్రజాస్వామ్య పార్లమెంటరీ విధానానికీ, దీనికీ సిద్ధాంతరీత్యా ఎక్కడా పోలిక లేదు. కష్టజీవులందరిని దోపిడిచేయుట కాదు సోవియట్ రాజ్యాంగకర్తవ్యం. వారినందరిని పూర్తిగా విముక్తి గావించి, శ్రామిక నియంతృత్వమును ఎదుర్కొనే కర్తవ్యాలను నెరవేర్చుటయే సోవియట్ రాజ్యాంగంయొక్క ఆశయం.

సోవియట్ల అధికారం బయలుదేరుటతో, బూర్జువా పార్లమెంటరీ యుగం, అంతమై ప్రపంచ చరిత్రలో శ్రామికవర్గ నియంతృత్వ యుగం ప్రారంభమయిందని లెనిన్ సరిగ్గా చెప్పాడు.

సోవియట్ రాజ్యాంగముయొక్క ప్రధాన లక్షణాలు ఏమిటి ?

సమాజంలో వివిధవర్గాలు ఉన్నప్పుడు సాధ్యపడే రాజ్యాంగ నిర్మాణములన్నిటి కంటె ఎక్కువ ప్రజాస్వభావం కల్గిన ప్రజాస్వామిక రాజ్యాంగం, సోవియట్

రాజ్యాంగం. దోపిడిగాండ్రకు వ్యతిరేకంగా కార్మికులూ రైతులుకలసి సోవియట్లద్వారా పోరాటం చేశారు. ఈ పోరాటంలో సోవియట్లలో ఐక్యమైన ప్రజలు, అధికసంఖ్యాకులైన పీడితప్రజలు. అందువల్ల అధికసంఖ్యాకులైన పీడితప్రజలతో నిండియున్న సోవియట్ నిర్మాణం, అల్పసంఖ్యాకులైన దోపిడివర్గాలమీద అధికారంవహించే రాజ్యాంగసంస్థ.

వర్గసమాజంలో ఉన్న రాజ్యాంగ నిర్మాణములన్నిటికంటె సోవియట్ రాజ్యాంగం ఎక్కువ అంతర్జాతీయ స్వభావం కలిగి ఉంటుంది. ఎందుకంటే, సోవియట్ విధానంలో అన్నిరకములైన 'జాతిహింసలు' నిర్మూలించబడి, వివిధజాతులకు చెందిన కష్టజీవులందరూ ఐక్యమగుటవల్ల, అందరూకలిసి ఒకే రాజ్యాంగ సమ్మేళనములో సంఘటితమవుతారు.

సోవియట్ రాజ్యాంగ నిర్మాణ స్వభావంవల్ల సోవియట్లలో ఉన్నవారందరికంటె ఎక్కువ వర్గచైతన్యం, సంఘటితశక్తిగల శ్రామికవర్గం ఇతర పీడిత ప్రజాసామాన్యమునకు ముందు ఉండి నాయకత్వం వహించగలుగుతుంది.

"శ్రామికవర్గ మొక్కటే చిన్నాభిన్నమైన, వెనుకబడిన కష్టజీవులనూ, పీడిత జనసామాన్యాన్ని ఐక్యపరచి, నాయకత్వం వహించి, విప్లవపోరాటాన్ని నడిప గలదని ఇప్పటివరకూ జరిగిన విప్లవాల, పీడితవర్గాల ఉద్యమ అనుభవాలూ, ప్రపంచసోషలిస్టు ఉద్యమంయొక్క అనుభవమూ మనకు నేర్పుతున్నాయి. —(లెనిన్ సెలెక్టెడ్ వర్క్సు - 7 వ సంపుటం 232 పేజీ)

అనుభవంద్వారా గడించిన ఈపాఠాన్ని ఆచరణలో వర్తింపజేయుటకు సోవియట్ నిర్మాణం చక్కగా వినియోగపడుతుంది.

సోవియట్ విధానంలో ప్రాంతీయ నియోజక వర్గములమీద ఆధారపడి ఎన్నికలు జరుగవు. వాటిస్థానే, పారిశ్రామికసంస్థలలోనూ, ఫ్యాక్టరీలలోనూ, మిల్లులలోనూ ఎన్నికలు జరిగి సోవియట్లు ఏర్పడతాయి. శాసనములుచేసే అధికారం, పరిపాలనాధికారం రెండూ ఈసోవియట్లను ఉండుటవల్ల, కార్మికులకు, కష్టజీవులందరికి ప్రభుత్వ రాజ్యాంగముతో సంబంధము కలిగి, రాజ్యాంగ వ్యవహారములను నిర్వహించే పద్ధతులను వారు తెలుసుకో గల్గుతారు.

బూర్జువావర్గం అనుపాజ్ఞలలో ఉండి, ప్రజలను హింసించుటకై ఒకసాధనంగా ఉపయోగపడే సైన్యాన్ని సోవియట్ రాజ్యాంగం విముక్తిచేసి, స్వదేశ, విదేశ బూర్జువా వర్గాల దోపిడినుంచి ప్రజలను విముక్తిచేసే ప్రజాస్వాతంత్ర్య సైన్యముగా మార్చివేస్తుంది. అందువల్లనే లెనిన్ "ఒక్క సోవియట్ రాజ్యాంగ నిర్మాణమే పాత బూర్జువా నిరంకుశ అధికార యంత్రాన్ని వెంటనే పూర్తిగా నాశనం చేయగలదని" చెప్పాడు.

ఏ మినహాయింపులు, హద్దులు లేకుండా పాల్గొనుటకై నిరంతరం కష్టజీవులందరి ప్రజాసంఘాలను రాజ్యాంగములోకి లాగగలిగిన సోవియట్ రాజ్యాంగ నిర్మాణం, క్రమేణా రాజ్యాంగ యంత్రం వీగిపోయే పరిస్థితులకు దారితీస్తుంది. రాజ్యాంగయంత్రం లేకుండా పోవుట భావి కమ్యూనిస్టు సమాజస్థాపనలో ఒక ముఖ్య విషయం.

ఎంతకాలంనుంచియో ఆశించబడి చివరికి కనుగొనబడిన రాజకీయరూపం, సోవియట్ రాజ్యాంగ నిర్మాణం. ఈ విధానంలో శ్రామికవర్గం నిజమైన ఆర్థిక విముక్తిని పొంది

సంపూర్ణ సోషలిస్టు విజయాన్ని సాధించ గలదు.

పారిస్ కమ్యూన్ (1871) ఈ రాజకీయ నిర్మాణంయొక్క అంకురం. అది అభివృద్ధియై అంతిమ రూపంలో సోవియట్ నిర్మాణంగా పరిణామం చెందింది.

అందువల్లనే లెనిన్ ఈ క్రిందివిధంగా చెప్పాడు:

"కార్మికులు, సైనికులు, రైతుల యొక్క ప్రతినిధులతో ఏర్పడిన సోవియట్లు ప్రజాస్వామ్యం అన్నిటి కంటె అభివృద్ధియైన ప్రజా స్వామ్య సంస్థయేగాక, సోషలిజ మును స్థాపించుటకు దారితీయగల ఒకే ఒక నిర్మాణం."

(లెనిన్ సెలెక్టెడ్ వర్క్సు 6 వ సంపుటం 447 వ పేజీ)

—"ప్రోబ్లమ్సు ఆఫ్ లెనినిజం" అనే గ్రంథంలో "శ్రామికవర్గ నియంతృత్వం" అనే అధ్యాయం.

"సోషలిజంఅంటే వర్గరాహిత్యం. ఈవర్గరాహిత్యాన్ని సాధించుటకు శ్రామికవర్గ నియంతృత్వం పూర్తిగా పాటు పడుతుంది. కాని వర్గాలను పున్నపాళంగా రద్దుచేయడం అసం భవం. శ్రామికవర్గ నియంతృత్వ దశలోకూడా వర్గాలు ఉన్నాయి. ఉంటాయికూడాను. వర్గాలు అంతరించి పోయి నప్పుడు శ్రామికవర్గ నియంతృత్వం అవసరమే ఉండదు. అయితే ఇలాంటి నియంతృత్వం లేకుండామాత్రం వర్గాలు రూపుమాప బడవు. శ్రామికవర్గ నియంతృత్వకాలంలో కూడా వర్గాలు ఉన్నాయి. అయితే వాటి రూపురేఖలుమాత్రం మారుతాయి. వాటి మధ్యనుండే సంబంధాలు మారుతాయి. శ్రామికవర్గ నియంతృత్వకాలంలో వర్గపోరాటం అదృశ్యం కాదు; అది మరొక రూపంమాత్రమే ధరిస్తుంది."

— లెనిన్

# వలసరాజ్యాలకై అమెరికా కొత్తవేట

★ వి. లాట్స్కీ

జనవరి 20 తేదీన ప్రారంభోపన్యాసంలో అధ్యక్షుడు ట్రూమన్ తన దేశ కార్యవిధానాన్ని వివరిస్తూ "నాలుగు ప్రధానమార్గాల"ను పేర్కొన్నాడు. వాటిలో ఒకదాని విషయమై ముచ్చటిస్తూ యీ విధంగా విశదపర్చాడు:

"ఇతరజాతుల సహకారంతో, అభివృద్ధి కావాల్సిన ప్రాంతాలకు మనం పెట్టుబడి విస్తరింపజేసి, తద్వారా వాటి అభివృద్ధికి కృషిచేయాలి".

ఈ ఉపన్యాసంపై వ్యాఖ్యానిస్తూ అమెరికన్ పత్రికలు "వెనకబడ్డ ప్రదేశాలు" అంటూ స్పష్టంచేశాయి. అయితే ఈ వెనకబడ్డ ప్రదేశాలు" ఏవి? ఆఫ్రికాఖండం, మధ్యధరాప్రదేశం, మధ్యప్రాచ్యం, దూరప్రాచ్య దేశాలు, ఇండియా, పాకిస్థాన్ దేశాలన్నీ వీటికింద జమకట్టబడ్డాయి.

ఇంకోవిధంగా చెప్పాలంటే ఆసియా, ఆఫ్రికాఖండాలలోని వలసదేశాలు, మార్షల్ ప్రణాళికవల్ల సహాయంపొందిన బ్రిటన్, ఫ్రాన్సు బెల్జియం, హాలండ్ మొదలైన దేశాలు.

యూరోపియన్ సామ్రాజ్యవాద దేశాలను తమగుప్పెట్లో వుంచుకున్న అమెరికా గుత్తవ్యాపారస్తులు యిప్పుడు వాటి అధీనంలో వున్న వలసదేశాలపై, తమకే పెత్తనం కావాలంటూ బహిరంగంగా ప్రకటిస్తున్నారు. కనుకనే ట్రూమన్‌గారి యీ నూతన ప్రణాళికను అమెరికన్ పత్రికలు అమోఘమంటూ పొగిడేసాయి. ఈ నూతన ప్రణాళిక మార్షల్ పాతప్రణాళికకు మరోమెట్టు. పాత మార్షల్ ప్రణాళికలాగానే యిదికూడ ప్రపంచంపై అమెరికన్ గుత్తవ్యాపారస్తుల ప్రాబల్యాన్ని పెంచటానికి నిర్దేశించబడింది.

వలసప్రాంత విస్తరణకై ఉద్దేశించబడ్డ యీ సుదీర్ఘ ప్రణాళికను ప్రకటిస్తూ ట్రూమన్ యిలా అన్నాడు.

"విదేశాలను లాభాలతో దోచుకోవాలనే పాత సామ్రాజ్యవాద విధానాలకు మన ప్రణాళికలో స్థానంలేదు."

కాని అమెరికన్ పత్రికలు అసలు గుట్టును బయటకు కక్కేశాయి: "వెనకబడ్డ ప్రాంతాలలో" ప్రయివేట్ సంస్థలు, అంతర్జాతీయ అభివృద్ధి అధినేతల ఆధ్వర్యాన పారిశ్రామిక పునర్నిర్మాణాల బ్యాంకు, మార్షల్ ప్రణాళిక పెట్టుబడులు స్థాపించబడుతాయని వెల్లడించాయి. వలసదేశప్రజలను దోచుకోవటంద్వారా లాభాలను గడించటానికే

అమెరికన్ గుత్తవ్యాపారస్థులు ఈ పెట్టుబడులను స్థాపించుతున్నారనేది నిర్వివాదాంశం.

పెట్టుబడిదారీ ఆర్థిక విధానంలో యిదొక ప్రాథమిక సూత్రమని ప్రతివానికి తెలును. అందువల్ల ఎన్ని కల్లిబొల్లి కబుర్లు వల్లించినా పై నగ్నసత్యాన్ని మరుగుపర్చలేదు.

"ఆసియా, ఆఫ్రికా దేశాల వెనకబడ్డ ప్రాంతాలలో" యిప్పుడు నడుస్తున్న అమెరికన్ గుత్తవ్యాపారిక సంస్థలు ఏవిధంగా వలసదేశ కార్మికులను దోచుకుంటూ, అపారమైన విపరీత లాభాలను గుంజుతున్నాయో అందరికీ తెలిసినవిషయమే. ఈ విషయంలో ట్రూమన్ పేర్కొన్న "పాతసామ్రాజ్యవాద విధానానికి", అమెరికన్ గుత్తవ్యాపారిక సంస్థలకు ఆచరణలో ఎట్టి తేడాకూడాలేదు.

కాని ఒకవిషయంలో మాత్రం స్పష్టమైన మార్పువుంది. అమెరికాకబంధుని హస్తాలు అత్యంతవేగంగాను విశాలప్రదేశాలకు ఈ కార్యక్రమంద్వారా పరచబడుతున్నాయి. అమెరికన్ గుత్తవ్యాపారికసంస్థలు మొత్తంగా వలసదేశాలను, వెనకబడ్డ ప్రాంతాలను దిగమ్రింగాలని కలలుగంటున్నాయి. కనుకనే యీ విషయంలో అమెరికన్ గుత్తవ్యాపారిక సంస్థలు, సామ్రాజ్యవాదదేశాలతో "సహకరించడానికి" సంసిద్ధతను వెల్లడించాయి. సామ్రాజ్యవాద దేశాలకు తమతమ వలసదేశాలలో నామమాత్రమైన అధికారం అంగీకరించటం. మిన్నుముట్టుతున్న వలసదేశ విముక్తి ప్రజోద్యమాలను సామ్రాజ్యవాద శక్తులచే కాలరాచి వేయించటం, అమెరికన్ పారిశ్రామికసంస్థలకు వారు కావలికుక్కలుగా ఉపయోగించుకోవటం, వీటితోపాటు వలసదేశ దోపిడీలో వారికి చిన్నవాటాను పంచిపెట్టటం, ఇదీ అమెరికన్ గుత్తవ్యాపారస్థులకు, సామ్రాజ్యవాద దేశాలకు మధ్య కుదరనున్న "సహకారం". వలసదేశ దోపిడీలో సంపాదించిన లాభాలలో పెద్దమొత్తం అమెరికన్ గుత్తవ్యాపారస్థుల బొక్కసంలోకి వెళ్లుతాయి.

వలసదేశాలు వివిధ సామ్రాజ్యవాద దేశాల ఆధీనంలోవుండగా, అమెరికన్ పెట్టుబడిదారులకు వలసదేశాలనుండి కొద్దిలాభాలు మాత్రం లభిస్తూవుండేవి. అందువలననే యితర దేశాలకు వలసదేశాలలో "స్వేచ్ఛావ్యాపారానికి" అవకాశం కలుగచేయాలంటూ అమెరికా పట్టుబట్టింది. కాని సామ్రాజ్యవాద దేశాలు యీ 'స్వేచ్ఛావ్యాపార' సూత్రాన్ని తిరస్కరించాయి. తమతమ వలసప్రాంతాలలో కట్టుదిట్టాలు చేసుకొని, తమకన్నా ఆర్థికంగా బలమైన పోటీదారుడైన అమెరికన్ డాలర్ భూతాన్ని వలసదేశప్రాంతాలకు రానివ్వలేదు. కాని యిప్పుడు మార్షల్ ముష్టికై చేతులు చాచిన సామ్రాజ్యవాద దేశాలకు అమెరికా హుకుం జారీచేసింది; వలసదేశాలకు అమెరికన వ్యాపారిక సంస్థలను ఆహ్వానించమని. 'జీహుకుం' అంటూ ముష్టిని పుచ్చుకొన్న దేశాలు తాఖీదులను శిరసావహించాయి.

ట్రూమన్ ప్రారంభోపన్యాసానికి మర్నాడే బ్రిటిషు విదేశాంగశాఖ తరఫున ఈవిధంగా ప్రకటించబడింది: బ్రిటిషు ప్రభుత్వం, "వెనకబడ్డ ప్రదేశాలను అభివృద్ధి చేయటం విషయంలో ప్రత్యేకశ్రద్ధను తీసుకుంటుంది." పైగా ట్రూమన్ ఈవిషయంలో చెప్పిన మాటలు "బ్రిటిషు ప్రభుత్వ విధానంలో పూర్తిగా ఏకీభవిస్తాయి".

మరి ఐదురోజులకు విదేశవార్తాసంస్థయిచ్చిన అల్పాహారవిందు సందర్భంలో లండన్‌లో మాట్లాడుతూ బెవిన్ యిలా అన్నాడు:

"ట్రూమన్ ప్రకటనను మేము ఆహ్వానిస్తాం. మాకున్న శక్తిని, విజ్ఞానాన్ని, సంపదను అంతా కేంద్రీకరించి ఈ విషయంలో కృషిచేస్తాం."

బ్రిటిషు పాలకులు శిథిలమైపోతున్న తమ సామ్రాజ్యసౌధాన్ని అమెరికన్ సాయంతో రక్షించుకోవాలని ఆశపడటం సాధ్యమే. కాని యీవిధంగా కళ్లుమూసుకొని ట్రూమన్ ప్రణాళికను అంగీకరించటమంటే, తమ మరణ శాసనాన్ని వ్రాసియివ్వటంతప్ప వేరుగాదు.

అభివృద్ధినిరోధక "అబ్జర్వర్" పత్రిక తూర్పు మధ్యధరా ప్రదేశాలనుగూర్చి జనవరి 9 వ తేదీన వ్రాస్తూ యిలా అన్నది:

"ఈ ముఖ్యమైన ప్రాంతంలో శాంతిని స్థాపించేశక్తి నేడు బ్రిటన్ కాదు; అమెరికా యీప్రాంతంపైన పూర్తిప్రాబల్యాన్ని సాధించుకొంది. ఈ పరిస్థితి (బ్రిటన్ పలుకుబడి తగ్గటం) అమెరికా సహకరించి పనిచేస్తే చక్కబడవచ్చు. అమెరికాను తోసిరాజనరాదు. యదార్థపరిస్థితినిబట్టి... కొంతకాలం మధ్యప్రాచ్య ప్రాంతంలో మనం తలవంచుకు పోయినా పరవాలేదు. అంటే నెమ్మదిగా, ఆర్భాటంలేకుండా మన పని మనం చేసుకుంటూపోతే బ్రిటిషు స్థావరం చెక్కుచెదరకుండా కాపాడుకోవచ్చు. ద్వితీయస్థానమైనప్పటికి ప్రధాన శక్తిగానే వుంటుంది."

ఇంకోవిధంగా చెప్పాలంటే మధ్యప్రాచ్య ప్రాంతంలో బ్రిటన్ తన నాయకత్వానికి ఉద్వాసనచెప్పి, ఆ ఆధిపత్యాన్ని అమెరికాకు కట్టబెట్టడంద్వారా రాజీపడి, పిల్లవాటాదారుగా వుండటానికి సిద్ధపడటమన్నమాట. మధ్యప్రాచ్యప్రాంత ప్రజోద్యమాల ధాటికి బ్రిటన్ తట్టుకోలేకపోతోంది. అందువల్ల అమెరికాసాయంతో పిల్లవాటాదారుగా, తన మనుగడ సాగించటానికి తయారయింది. ఇదే సలహాను అట్లీ - బెవిన్‌లు తు. చ. తప్పకుండా ఆచరిస్తున్నారు. ఈ ప్రాతిపదికపైననే గత జనవరిలో ఆంగ్లో - అమెరికన్ ప్రభుత్వాలకు మధ్యప్రాచ్య వ్యవహారాల విషయమై రాజీకుదిరింది.

అమెరికన్ పెట్టుబడిదారులు మధ్యప్రాచ్య ప్రదేశంతో సంతృప్తిపడి వూరుకోవటంలేదు. 'సహకారం' పేరిట బ్రిటిషు సామ్రాజ్యమంతటపైనా వలస ప్రాంతాలన్నిటిపైన వెనకబడ్డ ఆఫ్రికాఖండాలలోని అధీనదేశాలన్నింటిపైనా, అమెరికాముష్టిపై ఆధారపడిన యితర యూరపియన్ దేశాలపైన పెత్తనం సంపాదించాలని అమెరికన్ పెట్టుబడిదారులు చూస్తున్నారు.

* * *

యూరోపియన్ దేశాల అధీనంలోవున్న వలస ప్రాంతాలలో యిప్పటికప్పుడే అమెరికన్ గుత్తవ్యాపారిక సంస్థలు చొచ్చుకుపోయి వున్నాయి.

ఇండోనేషియాలో అమెరికన్ పెట్టుబడులు 1922 లోనే స్థాపించబడ్డాయి. రాక్‌ఫెల్లర్ స్టాండర్డ్ ఆయిల్‌కంపెనీ సుమిత్రా దీవిలోని నూనెగనులలో వాటాలు సంపాదించి, 1922 నుంచికూడ దోపిడీచేస్తున్నాయి. నేడు ఇండోనేషియాలో రాక్‌ఫెల్లర్ ఆయిల్‌కంపెనీ, అనేక నూనెగనుల ప్రాంతాలను, నూనె శుద్ధిపరిచే యంత్రాలను కలిగివుంది. అమెరికాకు పది లక్షల యకరాలకు మించిన రబ్బరుతోటలున్నాయి. వాటిలో లక్షలాది యకరాల తోటలు గుడ్‌రిచ్ రబ్బరుకంపెనీ, యునైటెడ్ స్టేట్స్ రబ్బరుకంపెనీకి చెందినవి. అమెరికన్ వ్యాపారిక సంస్థలు డచ్చివారినుండి యింకా అనేకతోటలను కొనివేసాయి. అమెరికన్ గుత్తవ్యాపారిక సంస్థలు ఇండోనేషియా ఆర్థికపునర్నిర్మాణమంటూ ఒక ప్రణాళిక తయారుచేసి సిద్ధంగా వుంచాయి. ఈ ప్రణాళికవల్ల ఇండోనేషియా అమెరికన్ పెట్టుబడిదారులకు ఒక మార్కెట్‌లాగా ఉపయోగ

పడుతుంది. డచ్చి ప్రభుత్వానికి మార్షల్ ప్రణాళిక క్రింద అప్పులు పెట్టి ప్రతిఫలంగా ఇండొనేషియాలో సహజసంపదను విచ్చలవిడిగా దోచుకోవడానికి హక్కును సంపాదించింది. అమెరికన్ సంస్థలు సెలెబెస్ దీవిలో నికెల్ గనులపై అధికారం కలిగివున్నాయి. ఇక సంస్థలు యిప్పుడు సుమిత్రా, న్యూగినియా, బోర్నియోలలో కొత్తనూనెగనుల ప్రాంతాలను సంపాదించుకొంటున్నాయి. బిల్లిటన్, బాంగ్‌కా దీవులనుంచి తగరం, సీసం ఎగుమతి చేస్తున్నాయి.

అమెరికన్ వైమానికదళం, ఇండొనేషియాలో సంపూర్ణ పర్యవేక్షణను పూర్తి చేసాయి. యుద్ధతంత్రరీత్యా కావలసిన కీలక ప్రదేశాలను నిర్ణయించటం, కొత్త నూనెగనులను కనిపెట్టడంకోసం ఈ పర్యవేక్షణ జరుపబడింది. అమెరికన్ వైమానిక కంపెనీలు జావా, బోర్నియో, సెలెబెస్, న్యూగినియా దీవులలో విమానాశ్రయాలను నిర్మించాయి. ఇండొనేషియాలో అమెరికన్ పెట్టుబడులు క్రమంగా పెరిగిపోతున్నాయి. 1946 లో అమెరికన్ పెట్టుబడులు, విదేశ పెట్టుబడులలో నూరింట పదివంతులుంటే, నేడు 40 వంతుల వరకు పెరిగింది. బ్రిటిషు పెట్టుబడులకు రెండింతలు, డచ్చి పెట్టుబడులకు రెండున్నరరెట్లు అమెరికన్ పెట్టుబడులే ఉన్నాయి.

ఇండొనేషియన్ రిపబ్లిక్ పైకి డచ్చి సామ్రాజ్యవాదులను ఉసికొల్పుతూ, పూర్తి సహాయం చేస్తూ, మరొకప్రక్క అమెరికా తన ఆర్థిక ప్రాబల్యవిస్తరణకు ఎడతెరపి లేకుండా పనిచేస్తోంది. ఇండొనేషియన్ ప్రజల స్వాతంత్ర్యాన్ని "గుడ్ ఆఫీసెస్" ముసుగు సాయంతో క్రూరంగా అణచివేస్తూ తన స్వార్థాన్ని నెరవేర్చుకోవాలని అమెరికా పూర్తిగా ప్రయత్నిస్తోంది.

ఈవిధంగా ఇండొనేషియాలో పాదుకొనిపోయి, దానిని స్థావరంగా వినియోగించుకుంటూ అమెరికన్ గుత్తవ్యాపార సంస్థలు, ఆగ్నేయ ఆసియా దేశాలైన మలయా, వియట్నాం బర్మా, ఇండియా, పాకిస్థాన్ దేశాలలోకి జొరబడుతున్నాయి.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలోనే అమెరికాకు ఫ్రెంచి వలసదేశాలలో స్థావరం చేజిక్కింది. మిత్రరాజ్య సైన్యాలు, ఉత్తరాఫ్రికాలో ప్రవేశించుటకు తరువాయిగా అమెరికన్ వ్యాపారసంస్థలు అల్జీరియా, ట్యునిస్, మొరాకోలలో నూనెగనులపై పెత్తనం సంపాదించుకోవడం మొదలుపెట్టాయి.

జనవరి 19 "న్యూయార్కు టైమ్స్" పారిస్ విలేఖరి కథనం ప్రకారం అమెరికన్ గల్ఫ ఆయిల్ కంపెనీకి, ట్యునిస్‌లో నూనెగనులు త్వరలోనే సంక్రమించగలవని తెలుస్తోంది. అమెరికన్ వ్యాపారసంస్థలు వలసదేశ పరిశ్రమలలోగల ఫ్రెంచి వాటాలను ఖరీదు చేస్తున్నాయి. అసలు యిప్పుడు నామమాత్రంగావున్న వాటాలుకూడ యికముందు ఫ్రెంచివారికి వుండవు.

న్యూమాంట్ మైనింగ్ కంపెనీ, సెంట్ జోసెఫ్ లెడ్ కంపెనీ, మైన్స్ ఇన్‌కార్పొరేటెడ్ —ఈ మూడు కంపెనీలకు 1947 సం॥లో ఫ్రెంచి మొరాకో ప్రాంతపు సీసం - త్పత్తిలో నూటికి 50 వంతులపై అధికారంగలదు. లైబీరియాను స్థావరంగా చేసుకొని, అమెరికన్ పెట్టుబడిదార్లు పశ్చిమ ఫ్రెంచి ఆఫ్రికాలోకి, భూమధ్యరేఖ ప్రాంతపు ఆఫ్రికాలోకి చొచ్చుకపోతున్నారు. ఈవిధంగా అమెరికా ఆర్థిక ప్రాబల్యాన్ని విస్తరింపచేసుకొంటూ, రెండోవైపున తన మిలిటరీ స్థావరాలను దిట్టపర్చుకొంటోంది. తన యుద్ధకాలపు సైనిక యంత్రాన్ని యథాతథంగా వుంచటమే కాక, మిలటరీ, నౌకా, వైమానిక స్థావరాలను

పించుకుంటూ, ఫ్రెంచి యూనియన్ ప్రాంతాలలో అనేక కీలక ప్రదేశాలను సంపాదించింది.

అమెరికన్ సామ్రాజ్యం తన ఫ్రెంచి సోదరులకు సాయం చేస్తూ వియట్నాం ప్రజలపై యుద్ధాన్ని ప్రోత్సహిస్తోంది. ఈ సందర్భంలో ప్రఖ్యాత యుద్ధోన్మాది విలియమ్ బిల్లిత్ 1947 సంవత్సర సమాప్తంలో వియట్నాం యాత్ర గమనించతగింది. అమెరికన్ - ఫ్రెంచి సామ్రాజ్యవాదుల తొత్తు అయిన మాజీ చక్రవర్తి బావోడాయ్‌ని తిరిగి సింహాసనంపై ఎక్కించాలనే ఉద్దేశంతో ఇతను వియట్నాంను సందర్శించాడు. ఈ కుట్ర ముఖ్యోద్దేశం వియట్నాం దేశాన్ని అమెరికన్ వలసదేశంగా మార్చి, దాని సహజసంపదను ముఖ్యంగా రబ్బర్, ఇండో - చైనా రైల్వేను దోచుకోవాలని మాత్రమే. అమెరికన్ సామ్రాజ్యవాదులు, వారి తొత్తులయిన ఫ్రెంచి పాలకులు యీ ప్లాను అమలుజరపాలని వత్తిడి తెస్తున్నారు.

రెండవ ప్రపంచయుద్ధకాలంనుండి బెల్జియన్ కాంగోలో, అమెరికన్ పెట్టుబడిదార్లు అధికారం చెలాయిస్తున్నారు. అక్కడ లభ్యమయ్యే ముడియురేనియం అంతా వారే ఎగుమతి చేసుకుంటున్నారు. ఆ ప్రాంతంలోని తగరం, రాగి గనులపై అధికారం వారిదే.

పోర్చుగీస్‌కు చెందిన తూర్పు ఆఫ్రికాలో అమెరికన్ గల్ఫ్ ఆయిల్ కంపెనీకి మొన్ని మధ్యనే అధికారం సంప్రాప్తించింది.

గత సంవత్సర ప్రారంభంలో ఇదివరలో ఇటలీ వలస ప్రాంతంగా వున్న లిబియాలో వైమానిక స్థావరాన్ని అమెరికా సంపాదించుకొంది. మధ్యధరా ప్రాంతంలో అమెరికన్ నావికా సైనికాధిపతి అడ్మిరల్ షర్మన్ స్పానిష్ మొరాకోలోను, కానరీ దీవులలోను స్థావరాలు సంపాదించటం కోసం ఫాసిస్టు ఫ్రాంకోతో మంతనాలు జరిపాడు. ఈ స్పానిష్ వలస దేశాలలో అమెరికన్ రక్షణ ప్రదేశాలను ఏర్పరచుకొని, అక్కడి అమెరికన్ సైన్యాలు ఉంచబడుతాయి.

బ్రిటిషు వలసదేశాలతో వ్యాపారం విషయంలో అమెరికా బ్రిటన్‌ను జయప్రదంగా వెనక్కు నెట్టివేయగల్గింది. 1947 సంగులో బ్రిటన్ దేశాన్ని మినహాయించి, దాని వలస ప్రాంతాలకు అమెరికా చేసిన ఎగుమతుల విలువ 3900 మిలియన్ల డాలర్లు. కాని యింగ్లండు చేసిన యెగుమతుల విలువ 2300 మిలియన్ల డాలర్లు మాత్రం...... ఉత్తర రొడీషియాలోను, బ్రిటీషు ఆగ్నేయాఫ్రికాలోను వున్న రాగిగనులలో కొంత భాగాన్ని అమెరికన్ సంస్థలు కొనుక్కున్నాయి. దక్షిణాఫ్రికా యూనియన్ ప్రాంతంలోని కొన్ని క్రోమియం గనులను కూడ అమెరికనులు స్వాధీనపర్చుకొన్నారు. బ్రిటిషు ప్రభుత్వ రక్షణ క్రింద వున్న కువాయత్‌లోని నూనెగనులలో సగభాగం అమెరికనుల ఆధీనంలోకివచ్చింది. ప్రపంచలో ఉత్పత్తి అయ్యే నూనెలో నూటికి 15 వంతులు కువాయిత్‌లో లభ్యమవుతుంది. సైప్రెస్ దీవిలో అమెరికా చక్కటి మిలిటరీ స్థావరాన్ని చేజిక్కించుకొంది. ఆఫ్రికా ఖండంలోని సహజ సంపదను దోచుకోవేందుకు అమెరికన్ సంస్థలు ఒక క్రొత్త సంస్థను స్థాపించాలని ప్రయత్నాలు చేస్తున్నాయి.

ఆసియా, ఆఫ్రికా ఖండాలలోని నామమాత్రమైన స్వతంత్రదేశాలనుండి బ్రిటన్‌ను పారద్రోలి, అక్కడ కీలకప్రదేశాలను చేజిక్కించుకోవటంలో అమెరికా చాలా చురుకుగా పనిచేస్తోంది.

సౌదీ అరేబియాలో 1933 సంవత్సర ప్రాంతానికే టెక్సాస్ ఆయిల్ కంపెనీ, స్టాండర్డ్ ఆయిల్ కంపెనీ, ఆఫ్ కాలిఫోర్నియా - ఈ రెండూ అక్కడ నూనెగనులపై గుత్తాధికారం సంపాదించుకొని మార్చి

న్నాయి. రెండవ ప్రపంచ యుద్ధానికి పూర్వమే అమెరికన్ - సాదీ అరేబియన్ మైనింగ్ సిండికేట్ ఆదేశంలోని బంగారం, యితర భూగర్భ సంపదలపై పూర్తి అధికారం పొందింది. సాదీ అరేబియాలో అమెరికనులు విమానాశ్రయాలను, నౌకాశ్రయాలను, రోడ్లను, రైలురోడ్లను నిర్మిస్తున్నారు. సాదీ అరేబియా - కువాయత్ దేశాల సరిహద్దు ప్రాంతంలోని ఎవరికి చెందని ప్రదేశంలోని నూనెగనులపై, అమెరికన్ యిండిపెండెంట్ ఆయిల్ కంపెనీ అధికారం గత సంవత్సరంలోనే పొందివుంది.

“ట్రూమన్ విధానం” (1947) ప్రకటించిన లగాయతు టర్కీ అమెరికాకు ఒక కీలకస్థావరంగా ఉపయోగపడటమే గాక, ఆర్థికప్రాబల్య విస్తరణకు ఒక రంగస్థలంగా మారిపోయింది. టర్కీ సైన్యానికి అమెరికా ఆయుధాలను సరఫరాచేస్తూ, దానిని పూర్తిగా స్వాధీనపర్చుకొంది. “సైనిక రాయబారాల”ను పంపి సైనికస్థావరాలను స్వాధీనపర్చుకొంది, అదేకాలంలో అమెరికన్ ఆర్థికప్రాబల్య విస్తరణకు టర్కీలో రాచబాటలు ఏర్పరచబడ్డాయి. 1947 మేలో టర్కీప్రభుత్వం దిగుమతులపై ఆంక్షలను తొలగించి, అమెరికన్ సరుకులకు చక్కటి మార్కెట్‌లాగా టర్కీని మార్చింది. టర్కీ సహజ సంపద అయిన నూనె, బొగ్గు, ఇనుము, క్రోమియం, రాగి, సీసం, సల్ఫర్ మొదలైన వాటితో అమెరికన్ సంస్థలు విపరీత లాభాలు గుంజుతున్నాయి. అమెరికన్ సరుకులను టర్కీలోకి ప్రవహింపచేసి, నూనెగనులను స్వాధీనపర్చుకుంటున్నారు. అమెరికన్ బ్యాంకులు, బ్రాంచి ఆఫీసులు టర్కీలో ఏర్పాటు చేశారు. వీటికి అమెరికన్ ఎగుమతి దిగుమతుల బ్యాంకు 25,000,000 డాలర్లు. “ట్రూమన్ విధానం, పేర 100,000,000 డాలర్లు, మార్షల్ ప్రణాళిక సహాయం క్రింద 10,000,000 డాలర్లు అప్పుగా లభించింది. 1947 జులైలో జరిగిన ‘సహాయ’ ఒడంబడిక, 1948 జులైలో జరిగిన “ఆర్థిక సహకార” ఒడంబడిక టర్కీ ఆర్థిక వ్యవస్థ పతనానికి దారి తీస్తోంది. అమెరికన్ ఆర్థిక ప్రాబల్య విస్తరణకు తోడ్పడుతుంది. ఇరాన్‌లో సైతం యుద్ధానికి పూర్వమే అమెరికన్ ఆయిల్ కంపెనీలు ప్రత్యేక సౌకర్యాలను సంపాదించుకున్నాయి. 1946 సం॥లో రాక్‌ఫెల్లర్ కార్పొరేషన్, స్టాండరు ఆయిల్ కంపెనీ - ఈ రెంటికి ఆంగ్లో ఇరానియన్ ఆయిల్ కంపెనీల మధ్య ఒక ఒడంబడిక కుదిరింది. దీనివల్ల అమెరికన్ వ్యాపారిక సంస్థలకు ఉత్పత్తి అయిన దానిలో 20 వంతులు గిట్టుబాటు అవుతుంది. ఈ 20 వంతులు చాలక మరొక 20 వంతులు రాబట్టుకోవడం కోసం ప్రయత్నాలు జరుగుతున్నాయి.

చాగ్రీన్ దీవులు అసలు ఇరాన్‌కు చెందినట్టివి. కాని తదుపరి బ్రిటిష్ రక్షణ ప్రాంతంలోకి జమకట్టబడ్డాయి. ఈ దీవులలోని నూనెగనులపై 1932 నుంచి అమెరికన్ సంస్థలు పెత్తనం వహిస్తున్నాయి. ఇరాన్-బ్రిటన్‌ల మధ్య పరస్పర వైషమ్యాలను అమెరికనులు అతి నేర్పుతో రెచ్చగొట్టుతున్నారు. ఈవిధంగా బ్రిటన్ పలుకుబడిని తగ్గించి అమెరికన్ ప్రాబల్యాన్ని పెంచుకోవాలని అమెరికనుల ఉద్దేశం.

ఇరాన్ నిండా అమెరికన్ సైన్యాలతోను సైనిక సలహాదారులతోను, యునైటెడ్ స్టేట్స్ నింపేసింది. ఇరాన్ సైన్యాన్ని పోలీసు శాఖను ఆయుధ కర్మాగారాలను సైనిక స్థావరాలను, రక్షణదుర్గాలను పూర్తిగా అమెరికా కంట్రోల్ క్రిందకు తీసుకున్నాయి. తదుపరి దేశపాలన విషయంలో నిత్యం జోక్యం కలుగజేసుకుంటూ అప్పటి ప్రజా

ద్యమాలను అణచుటకు అభివృద్ధినిరోధక వర్గాలను ప్రోత్సహిస్తున్నారు. ఈవిధమైన సైనిక, పోలీసు శాఖలపై అధికారం ఆర్థిక ప్రాబల్య విస్తరణకు వుపయోగపడుతుంది. ఇరాన్ కోసం "సప్త సంవత్సర ప్రణాళిక కంటూ" ఒక దానిని అమెరికన్ నిపుణులు తయారుచేశారు. దీనిని ఆచరణలోకి తీసుకొచ్చేందుకు అప్పుడే ప్రయత్నాలుకూడా చేస్తున్నారు. ఈ ప్రణాళిక విజయవంతంగా నెరవేరడమంటే అమెరికా గుత్తవ్యాపారస్థుల పంట పండినట్లే. ఇరాన్ ఆర్థిక వ్యవస్థ కూలిపోక మానదు.

ఆఫ్ఘనిస్థాన్‌లో కూడా యిదే తంతు. హేరత్‌లోని నూనె గనులపైనా, కాందహార్‌లోని వెండి గనుల ప్రాంతంపైనా, క్రోమియం గనుల ప్రాంతం పైన అమెరికన్ మారిసన్ కంపెనీకి అధికారం ప్రాప్తించింది. 1948 సంవత్సరాంతంలో వీటి విషయమై రాయబారాలు ప్రారంభమైనప్పుడు బ్రిటిషు ప్రభుత్వం అసమ్మతిని తెలియ చేసిందని "కియామ్-ఎ-ఇరాన్" పత్రికవల్ల తెలుస్తోంది.

ఈజిప్టులోని సినాయ్ ద్వీపకల్పంలోని అపారమైన నూనెగనులను అమెరికన్ సంస్థలు బ్రిటిషు సంస్థలతో కలిపి దోపిడి చేస్తున్నాయి సూయిజ్ కాలువలోని (ఫ్రెంచి, వాటిని వాటాలకుకొనేందుకు అమెరికనులు యిప్పుడు సంభాషణలు జరుపు తున్నారు. ఇదివరలో ఈజిప్టులో అమెరికా రాయభారిగా వున్న పిన్కిటక్ సూయిజ్ కాలువకు డైరెక్టరుగా నియమించ బడ్డాడు.

1947 సం॥లో ఈజిప్టు ప్రభుత్వం "టెక్నికల్ సహాయం" అనే కాంట్రాక్టును అనేక అమెరికను సంస్థలతో చేసుకుంది. దానివల్ల అనేక అమెరికన్ - ఈజిప్టు సంయుక్త పరిశ్రమలు స్థాపించబడుతున్నాయి.

సిరియా, లెబనాన్‌లలో పైప్ లైనుల నిర్మాణం, ఆయిల్ రిఫైనరీస్, ఆటోమొబైల్ ఫ్యాక్టరీలు యింకా అనేక యితర పరిశ్రమలపై అమెరికన్ వ్యాపారస్థులకు గుత్తాధికారం గలదు.

పాలస్తీనాలో 1945 వరకు అమెరికాకు గల 150,000,000 డాలర్లకు మించి వుంది. ఇజ్రాయిల్ దేశానికి అమెరికన్ ఎగుమతి దిగుమతుల బ్యాంకు 100,000,000 డాలర్లు అప్పుపెట్టడానికి సిద్ధంగావుంది.

ఇరాక్ పెట్రోలియం కంపెనీలో తమ వాటాలను యింకా పెంచుకోవటానికి, అమెరికన్ గుత్తవ్యాపారస్తులు ప్రయత్నాలు చేస్తున్నారు. ఇరాక్, ట్రాన్స్ జోర్డాన్‌లో ఇర్రిగేషన్ నిర్మాణానికి అమెరికా పెద్ద మొత్తాన్ని వెచ్చించబోతోంది.

1945 సెప్టెంబర్‌లో సింక్లెర్ ఆయిల్ కంపెనీ అబిసీనియాలో కొన్ని అధికారాలను సంపాదించుకొంది. 1947 సంవత్సరంలో ఆదేశానికి అమెరికా 3,000,000 డాలర్ల అప్పునిచ్చింది. అబిసీనియాలోని వైమానిక యానంపై గుత్తాధికారం అమెరికా సంపాదించింది. అమెరికన్ సలహాదార్ల అబిసీనియా ప్రభుత్వ శాఖలన్నీ నడుపబడుతున్నాయి. అమెరికన్ కోటీశ్వరుడు ఆయిల్ అధినేత రాక్‌ఫెల్లర్ ఈమధ్యనే ఇథోపియాను సందర్శించాడు.

ఇతర దేశాలపై ఆధారపడిన అర్థవలస దేశాలతోపాటు అన్నివలస దేశాలలోను,తమ ఆర్థిక ప్రాబల్యాన్ని విస్తరింపచేసేందుకు డాలర్ సామ్రాజ్యవాదం చాలాకాలంనుంచి కృషిచేస్తోంది. అందువల్ల ట్రూమన్ ప్రణాళికలో కొత్తంటూ ఏమీలేదు. ప్రపంచ పెత్తనానికై జరిగే పోరాటాన్ని మరింత ఉధృతపర్చేందుకు యీ ప్రణాళిక ఉపకరిస్తుంది.

వలస దేశాలలో మార్కెట్టుల కోసం, అత్యధిక లాభాల కోసమే యీ ట్రూమన్ ప్రణాళిక ఉద్దేశించటంలేదు. వాటితోపాటు వలసదేశాలలోని, సామ్రాజ్యవాద దేశాలలోని యుద్ధానికి అవసరమైన ముడిసరుకులను; కీలక ప్రదేశాలను సంపాదించటం యీ ప్రణాళిక ఉద్దేశం.

క్రితం సం॥ మధ్య భాగంలో యుద్ధావసర ముడిసరుకులను తనిఖీ చేసే శాఖ అధ్వర్యాన కొందరు నిపుణులు బ్రిటిషు వలస ప్రాంతాలకు పంపబడ్డారు. వీరు ముడిసరుకులు లభ్యమయ్యే ప్రదేశాలను పర్యవేక్షించి వచ్చారు. బ్రిటిష్ వలస దేశోద్ధరణ పేరుతో బ్రిటిషు వలస రాజ్యాలు సహజ సంపదను సంయుక్తంగా దోచుకొనేందుకు యీ ప్రణాళిక తయారు చేసారు. బ్రిటిషు వలస ప్రాంతాలలో సహజ సంపదంతా నిరుపయోగ మవుతోంది. కను; అమెరికన్ పెట్టుబడులకు ఈ ప్రాంతంలో స్వేచ్ఛను యిచ్చి, యూరప్ ఉద్ధరణకు యీ ముడి సరుకులు ఉపయోగపడుతయి కనుక తప్పక అంగీకరించాలని అమెరికా పట్టు బట్టింది.

పశ్చిమ సామ్రాజ్యవాద దేశాల వలస ప్రాంతాలలోకి ఆసియా, ఆఫ్రికా ఖండాల లోని నామమాత్రమైన స్వతంత్రదేశాలలోకి ఖచ్చితమైన స్వార్థ దృష్టితోనే అమెరికన్ పెట్టుబడిదార్లు ప్రవేశిస్తున్నారు. తమ నిజోద్దేశాలను మరుగుపెట్టి, తియ్యటి కబుర్లతో ప్రపంచ ప్రజల కళ్ళు కప్పాలని అమెరికన్ సామ్రాజ్యవాదులు చూస్తున్నారు. "వెనకబడ్డ ప్రదేశాలను అభివృద్ధి పరిచటానికి", "నాగరికతను వ్యాపింపచేయటానికి", తాము కంకణ బద్ధులమైనట్లు గప్పాలు కొట్టుతారు. "పాత సామ్రాజ్యవాదులు" సైతం యిటువంటి కల్లిబొల్లికబుర్లనే అల్లారు.

ట్రూమన్ ఉపన్యాసాన్ని కొండ కెత్తుతూ తను చేసిన మహోపన్యాసంలోనే బెవిన్ బ్రిటిషు ప్రభుత్వం వలసదేశ ప్రజలకు దారిద్ర్యాన్ని తప్ప, యింకేమీ యివ్వలేకపోయిందని అంగీకరించాడు.

"బెవిన్ సున్నితమైన తన పరిభాషలో మనం సాధించిన విజయాల యొక్క ఫలితాలు, ఆ ప్రజల జీవన ప్రమాణం పెరగటంలో దోహదకం కాలేదు" అన్నాడు కాని అమెరికన్ పెట్టుబడి సహకారంతో "చక్కటి జీవన ప్రమాణం, సౌఖ్యవంతమైన జీవితం" వలసదేశ ప్రజానీకానికి సిద్ధించి తీరుతుందని తను ఆశిస్తున్నట్లు చెప్పాడు.

పైగా, అమెరికాయొక్క యీ విస్తరణ ప్రణాళికను బలపర్చే వారంతా ఉన్నసిగ్గును కాస్తా విడచి, వలసదేశ ప్రజల జీవన ప్రమాణం పెంచటం ద్వారా వారిని కమ్యూనిస్టు కౌగిలినుంచి తప్పించవచ్చుని వాగుతున్నారు.

కనుక ప్రపంచ పెత్తనం కోసం జరిగే యీ పెనుగులాటలో కూడ, వారు వారి పూర్వుల అడుగు జాడలలోనే నడుస్తున్నారు. వారి పూర్వులు కమ్యూనిస్టు వ్యతిరేకతను చూపెట్టి, ప్రపంచ పెత్తనం సాధించాలనుకొని నశించిపోయారు. తిరిగి వారు యిప్పుడు అదే నినాదంతో ప్రపంచ పెత్తనాన్ని సాధించ పూనుకొన్నారు. ఎన్ని గప్పాలు కొట్టినప్పటికీ, సామ్రాజ్యవాదుల గుండెదడ మనకు కనపడుతూనే వుంది. వలస దేశాలలోనూ, యితర ఆధీనదేశాలలోనూ, ప్రజాతంత్రశక్తులు ఉరకలు పెట్టుకుంటూ ముందడుగు వేస్తున్నాయి". ఆదే వారి గుండె దడకు కారణం.

వెనకబడ్డ ప్రాంత ప్రజలకు వీరు సృష్టించబోయే 'స్వర్గం' ప్రచరింపచేయబోయే 'నాగరికత'కు ఒక పసిడితునక యిదిగో.

సౌదీ అరేబియాలోని అమెరికన్ వ్యాపారిక సంస్థల నూనెగనులలో పనిచేసే కార్మి

కుల జీవితస్థితి గతులను ఒకసారి తెల్సుకుంటే చాలు. వారి నగ్న స్వరూపం యిట్టే తేలిపోతుంది.

ఆర్మ్కో కార్మికులకు సంవత్సరానికి ఎనిమిది సెలవురోజులు మాత్రం వుంటాయి. వారు మురికికూపాలలో నివసిస్తుంటారు. చివరకు కంపెనీ కట్టించే బ్యారకులు యిదే విధంగా వుంటాయి. 1947 సంవత్సరం యీ కంపెనీకి 68,000,000 డాలర్లు లాభాలు వచ్చాయి. కాని యీ గనులలో పనిచేసే 20 వేల కార్మికులకు జీతాలక్రింద ఖర్చుపెట్టిన మొత్తం, లాభంలో పదోవంతు లేదు. అరేబియాలో ఈ అమెరికన్ "నాగరికత ప్రదాతలు" మధ్యయుగాలనాటి ఆచారాలను బలవంతంగా, బుద్ధిపూర్వకంగా ప్రవేశపెట్టారు. అమెరికా ఆధీనంలోవున్న ప్రాంతంలో బానిసవ్యాపారం సర్వసాధారణం. కార్మికులు సంగీతం విన్నా, సినిమా చూసినా, యింకా నాగరికమైనపని యేది చేసినా నేరమవుతుంది. కార్మికులు శిక్షింపబడుతారు. "న్యాయచట్టాలను ఉల్లంఘించిన" వారి చేతులు నరకటం, యింకా యీ ప్రాంతంలో ఆచరణలో వుంది. ఇంత మానవజాతికి సిగ్గుచేటుపని యింకెక్కడ వుంటుంది? మధ్యయుగాలనాటి యీ శిక్షను అమెరికనులు "నాగరికం" చేసారు. పురాతన కత్తులకు బదులు చక్కటి పదునైన కత్తులతో, అమెరికన్ డాలర్లచే 'అపరాధుల' చేతులు కత్తిరించబడుతాయి.

అర్మ్కో కార్మికులు ఎల్లప్పుడూ పోలీసు నిఘాలో ఉంచబడుతారు. ఎవరన్నా అసంతృప్తి వెలిబుచ్చితే చాలు; చావతన్ని, ఉద్యోగానికి ఉద్వాసన చెప్పబడుతుంది. కార్మికోద్యమం అమెరికన్ ప్రాంతంలో నిషేధించబడింది. కార్మికోద్యమాన్ని నిత్యం అణచిపారేస్తూ వుంటారు.

'స్వాతంత్ర్యం' ముసుగుకింద ఫిలిప్పైన్స్ కార్మికులు దారుణంగా దోపిడీ చేయబడుతున్నారు.

లాటిన్ అమెరికాలో, అమెరికన్ గుత్త వ్యాపారస్తులు యేవిధంగా ప్రవర్తిస్తారో మనకు తెలియనిది కాదు. విపరీత లాభాల కోసం యీ దేశాల ప్రజలను అమెరికన్ గుత్తవ్యాపారస్థులు దోపిడీ చేస్తున్నారు.

లాటిన్ అమెరికన రాజ్యాలు ఆర్థికంగా రాజకీయంగా వాల్‌స్ట్రీట్ చేతిలో బందీలు.

ఇప్పుడు 'స్వంత వ్యాపారం' పేరుతో అమెరికా గుత్తవ్యాపారస్థులు వలస దేశాలలోకి సింహద్వారంగుండా ప్రవేశిస్తున్నారు. 'నాగరికత'ను వ్యాపింప చేయటానికంటూ కబుర్లు చెప్పుతున్నారు.

సామ్రాజ్యవాద దేశాలకు, అమెరికాకు మధ్యగల పరస్పర వైరుధ్యంవల్ల యీ విషయంలో పశ్చిమ రాజ్యాలు అనేక అడ్డంకులు కల్గించటం కూడ సంభవమైనదే. ఆంగ్లో అమెరికన్ వాటాదార్లకు గల స్వార్థంలోని వైరుధ్యం, బెవిన్ వాల్‌స్ట్రీట్‌కు దాసోహం అన్నంత మాత్రాన సమసిపోవు.

ఆసియా, ఆఫ్రికా ఖండంలోని ప్రజాసామాన్యం యీ ప్రణాళికను తుదిదాకా ఎదిరించి అడ్డుతుంది. దానికి కావలసిన చైతన్యం యుద్ధానంతరం ఆ ప్రజల్లో చాలా పెరిగింది.

దోపిడీ విస్తరణకై పడే తాపత్రయంలో అమెరికా వలసదేశ ప్రజాఉద్యమాలను మరింతగా అణచ చూస్తున్నారు. దానితో అసలే రగులుకొనే అసంతృప్తి జ్వాలలు మిన్నంటుతాయి. విముక్తి పోరాటాలు ఉధృతమవుతాయి. పెట్టుబడిదారీవిధానం, వలసవిధానం సంక్షోభంలో చిక్కుకొని శాశ్వతంగా నశించిపోతుంది.

— న్యూటైమ్సు
1949 (10) సంచిక

# జాతీయవాదం

# సామ్రాజ్యవాదుల ఆయుధం

— వై. ప్రాంత్ జెవ్

జాతీయవాదం, దోపిడీ వర్గాలకు చెందిన ఒక సిద్ధాంతం. అది దోపిడీ వర్గాలవలంబించే ఒక విధానం. తమ స్వార్థ ప్రయోజనాలకోసం, దోపిడీ వర్గాలు యీ సిద్ధాంతాన్ని పోషించి వృద్ధి చేస్తాయి.

చరిత్రనూ, చారిత్రక సత్యాలను, దురుద్దేశంతో తప్పుడుగా వ్యాఖ్యానించి, యీ జాతీయ వాద సిద్ధాంతం నిర్మింపబడింది. జాతులమధ్య పరస్పర సంబంధాల గురించి, శత్రుత్వాల గురించి, చరిత్ర అంతటికీ కాకమ్మకథలు కల్పించి, యీజాతీయ వాద సిద్ధాంతం నిర్మించ బడింది. జాతి అన్న భావానికే తప్పుడు వ్యాఖ్యానం చేసి, యీ జాతీయవాదం అనే సిద్ధాంతం నిర్మింప బడింది. జాతి అన్నది 'సహజమైన' సమాజంగానూ, సృష్టినుండి ఉద్భవించిన దానిగాను చెపుతారు. లేకపోతే, జాతి అన్నది అనంతమైన 'జాతీయశక్తి' అనికూడా చెపుతారు. 'తక్కువ' జాతులనబడే వారిమీద పెత్తనం చలాయించడానికి, కొన్ని 'దైవాంశమైన' జాతులున్నాయని చెప్పే మానవ ద్వేష సిద్ధాంతాన్ని సమర్థిస్తుంది యీ జాతీయవాదం.

కొన్నిజాతులను, యింకొన్ని జాతులు బానిసత్వంలో పెట్టడమూ; కొన్నిజాతుల యింకొన్నిజాతులు లొంగదీసి పాలించడమూ; వలస దేశాల ప్రజలనూ, అర్ధవలస దేశాల ప్రజలనూ దోపిడీచేయడమూ; అణగదొక్కడమూ, జాతీయవాదం యొక్క ఆదర్శం. అంతేగాదు. శ్రామికప్రజలలో అనైక్యతనుసృష్టిం

చడమూ; వారిని విభజించి ఒకరిపైకి మరొకరిని రెచ్చగొట్టడమూ; ప్రజాస్వామిక పోరాటంనుండి సోషలిజంకోసం జరిపే పోరాటంనుండి, వారిదృష్టినీ, శక్తినీ మరల్చడమూ; జాతీయవాదం అనుసరించే విధానం.

లెనిన్ యిలా అన్నాడు:

"పెట్టుబడిదారులవంక చూడండి... అన్ని జాతులకూ, అన్ని మతాలకూ చెందిన పెట్టుబడిదారులు, కార్మికులకు వ్యతిరేకంగా ఏకమవుతారు. కాని మరోవైపున వారే కార్మికులలో జాతిస్పర్ధలను రెచ్చగొట్టి, వారిని చీల్చి బలహీన పరచడానికి ప్రయత్నిస్తారు."

— లెనిన్ సెలక్టెడ్ వర్క్సు, రష్యన్ ప్రచురణ 16 వ సంపుటి 554 పేజీ

జాతీయవాదం కార్మికవర్గం ఉద్యమానికీ, శ్రామిక ప్రజానీకం అంతటికీ సంబంధించిన విముక్తి ఉద్యమానికీ, చాలా ప్రమాదకరమైన శత్రువు జాతీయవాద విషంతో శ్రామిక ప్రజల చైతన్యాన్ని ద్వేషపూరితంచేసి, కార్మికులు, శ్రామిక ప్రజానీకమంతా తమ వర్గ ప్రయోజనాలకోసం చేసే పోరాటం సాగకుండా, దోపిడీవర్గాలు చేస్తున్నాయి; తమ ఆధిపత్యాన్ని బలపరుచుకోవడానికి, శ్రామికప్రజానీకాన్ని నైతికంగా బలహీన పరుస్తున్నాయి.

మార్క్సిజం ఉద్భవించినప్పటి నుండీ, జాతీయవాదానికి వ్యతిరేకంగా అది యేరూపంలో వున్నా అచంచలంగా పోరాడుతోంది; శ్రామిక వర్గ అంతర్జాతీయ తత్వంతో జాతీయ వాదాన్ని వ్యతిరేకిస్తోంది. మార్క్సిస్టు పార్టీకి, శ్రామికవర్గ అంతర్జాతీయ వాదం ఒక మహత్తర నినాదం. మార్క్సిస్టు పార్టీయొక్క ప్రపంచ దృక్పథానికి, వర్తించే నినాదం ఇది; మార్క్సిస్టుపార్టీ రాజకీయాలను వ్యక్తంచేసే నినాదం అది.

అన్నిరకాల దోపిడీవర్గాలు, శ్రామిక ప్రజలపట్ల చేసే నిర్బంధానికీ, బలహీన జాతులపట్లచేసే నిర్బంధానికీ వ్యతిరేకంగా కార్మికులు, శ్రామిక ప్రజలందరూ జరిపే పోరాటంలో వారికి శ్రామికవర్గ అంతర్జాతీయవాదం చాలా బలమైన ఆయుధం. సామ్రాజ్యవాదాన్ని కూలద్రోయ్యడానికి కృషిసాగించడంలోనూ, ప్రజలకు స్వాతంత్ర్యాన్నీ, జాతీయ విముక్తినీ, సాధించడంలోనూ, సోషలిజాన్ని కమ్యూనిజాన్ని స్థాపించడంలోనూ, శ్రామికవర్గ అంతర్జాతీయవాదం అమోఘమైన పరికరం.

రష్యాలో సోషలిస్టు విప్లవం జరిగినప్పట్నుండీ, యీ సత్యాన్నే చరిత్ర స్పష్టంగా నిరూపిస్తోంది.

బోల్షివిక్ పార్టీ నాయకత్వాన 1917 అక్టోబరులో రష్యా కార్మికవర్గం సాధించిన అమోఘవిజయం, దాని శ్రామికవర్గ అంతర్జాతీయ దృక్పథానికి స్పష్టమైన ఉదాహరణ. సామ్రాజ్యవాదుల వ్యూహానికి మొట్టమొదటసారిగా గండికొట్టవలసిన

బాధ్యత, రష్యన్ కార్మికవర్గం నిర్వర్తించవలసి వచ్చింది. రష్యను శ్రామికవర్గ ప్రయోజనాలకే కాదు. అంతర్జాతీయ శ్రామికవర్గ ప్రయోజనాలకుకూడా యిది అవసరమైంది. తన దేశంలో సామ్రాజ్యవాదాన్ని కూలదోసి, రష్యన్ కార్మికవర్గం తాను విముక్తిపొందడమే కాకుండా, అంతర్జాతీయ కార్మికవర్గానికి యెంతో సహాయపడింది. విప్లవసమయంలో రష్యన్ శ్రామికవర్గం యిదే ఆశయంతో — అంటే ప్రపంచ కార్మికులందరి ప్రయోజనాల ఆశయంతో — పనిచేసింది.

అన్ని దేశాలలోని విప్లవశ్రామిక వర్గాలు కూడా, అక్టోబరు విప్లవాన్ని యిదే దృక్పథంతో చూశాయి. ఈ కారణంవల్లనే అక్టోబరు విప్లవానికి వారు సానుభూతి చూపారు, దానిని బలపర్చారు.

అదేవిధంగా అక్టోబరు విప్లవం విజయం పొందినతరువాత, సోషలిస్టు సమాజ నిర్మాణానికి కృషిచేస్తూ, తన సోషలిస్టు దేశపు ఆర్థికశక్తినీ స్వయం రక్షణశక్తినీ అభివృద్ధి చేయడానికి ఒకవైపున దీక్షతో పాటుబడుతూ, మరోవైపున రష్యన్ శ్రామికవర్గ బాధ్యతలు సోవియట్ యూనియన్‌లోని యితర జాతులకు చెందిన శ్రామికవర్గాల బాధ్యతలు, తన అంతర్జాతీయ బాధ్యతలనుండి విడదీయ రానివిగా, బోల్షివిక్ పార్టీ గుర్తించింది. ఈ విషయమై కామ్రేడ్ స్టాలిన్ యిలా అన్నాడు:

"పార్టీ దృక్పథం యిదీ: సోవియట్ శ్రామికవర్గ "జాతీయ" అంతర్జాతీయ బాధ్యతలు, పెట్టుబడిదారీ విధానంనుండి అన్ని దేశాల శ్రామికవర్గాలను విముక్తి చేయడం అనే ఆశయంలో మిళితమౌతాయి. మన దేశంలో సోషలిస్టుసమాజ నిర్మాణానికీ, అన్ని దేశాల విప్లవోద్యమాలకూ సమానప్రయోజనం, ప్రపంచం అంతటా విప్లవాలు విజయం పొందటం కాబట్టి, ఒక దేశం శ్రామికవర్గపు 'జాతీయ' బాధ్యతలు, ఆదేశపు అంతర్జాతీయ బాధ్యతలకంటె వేరుగా వుంటాయని అనుకోవడం, రాజకీయాల్లో చాల పెద్ద తప్పు చేయడమే అవుతుంది."

—(సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ చరిత్ర అధ్యాయానికి కూర్చబడిన గ్రంథ సంచయంనుండి; 3 సంపుటం, పుటలు 157-8)

## సోవియట్‌కూ ప్రపంచ కార్మికవర్గానికి మధ్యనున్న సన్నిహిత సంబంధాలు

మన దేశంలో సోషలిజంయొక్క అంతిమవిజయం, అంతర్జాతీయ శ్రామికవర్గతీవ్రకృషి, దానితోబాటు సోవియట్ ప్రజలందరి యింతకంటె అధికతరమైన తీవ్రకృషి కలిసినప్పుడే

ఫలిస్తుందని లెనిన్ స్టాలిన్‌లు సోవియట్ ప్రజలకు ఉద్బోధించారు. అన్ని దేశాల కార్మికవర్గాలతో, సోవియట్ కార్మికవర్గం సంబంధాలను దృఢపర్చుకోవాలని, వారు సోవియట్ కార్మికవర్గాన్ని పదేపదే హెచ్చరించారు

సోవియట్ యూనియన్ కార్మికవర్గం, ప్రపంచ కార్మికవర్గానికి నాయకత్వం వహిస్తోంది. మనదేశపు కార్మికవర్గంతో బాటు సోవియట్ ప్రజలందరూ, ప్రపంచ శ్రామిక ప్రజానీకానికి, ప్రపంచంలోని ప్రజాస్వామిక అభ్యుదయ కాముక శక్తులకూ అగ్రగాములుగా వున్నారు. సోవియట్ దేశ కార్మికవర్గపు అంతర్జాతీయ కృషికి యిది చక్కని ఉదాహరణ. సోవియట్ కార్మికవర్గపు పోరాటంలోని అంతర్జాతీయ తత్వం వల్ల, ప్రపంచ కార్మికులందరూ సోవియట్ యూనియన్ కార్మికవర్గాన్ని ప్రేమిస్తున్నారు. సోవియట్ కార్మికవర్గాన్ని తమ అగ్రసైనిక శ్రేణిగా పరిగణిస్తున్నారు. కమ్యూనిస్టుపార్టీ 17వ కాంగ్రెసు రిపోర్టులో కామ్రేడ్ స్టాలిన్ యిలా అన్నాడు:

"అనేక పోరాటాల్లో కాకలుతీరిన లెనినిస్టు పార్టీ నాయకత్వం వుండడంచేతనే కాదు, సోవియట్ యూనియన్ కార్మికవర్గం బలంగా వుండడానికి కారణం. లక్షలాది కష్టజీవులైన కర్షకులు, సోవియట్ కార్మికులకు సహకరించడంచేతకూడా కాదు. ప్రపంచ శ్రామికవర్గం సోవియట్ కార్మికులకు సహకరించి బలపర్చడంవల్లకూడా, సోవియట్ కార్మికవర్గం బలవత్తరంగావుంది. సోవియట్ కార్మికవర్గం ప్రపంచ శ్రామికవర్గంలో ఒక భాగం; దాని ప్రథమశ్రేణికూడా. ప్రపంచశ్రామికవర్గానికి, మన సోవియట్ రిపబ్లిక్ ముద్దుల బిడ్డ. పెట్టుబడిదారీ దేశాల కార్మికవర్గం, మన కార్మికవర్గాన్ని బలపర్చి వుండకపోయినట్లయితే, మనం అధికారం నిలబెట్టుకోగలిగేవాళ్ళం కాదు; సామ్యవాద నిర్మాణానికి అనుకూలమైన పరిస్థితులు లభ్యమయ్యేవి కాదు; కాబట్టి యిప్పుడు మనం సాధించిన విజయాలను సాధించగలిగివుండే వాళ్ళం కాదు. సోవియట్ కార్మికులకు పెట్టుబడిదారీ దేశాల కార్మికులకు మధ్య అంతర్జాతీయ సంబంధాలు; సోవియట్ కార్మికులకు అన్ని దేశాల కార్మికులకు మధ్య అన్యోన్య సౌభ్రాతృత్వం—యివి, మన సోవియట్ రిపబ్లిక్కు శక్తికీ బలానికీ, మూలస్తంభాలు. సోవియట్ కార్మికవర్గాన్ని ప్రపంచ కార్మికవర్గానికి ప్రథమ శ్రేణిలో వున్న సేనానిగా, పాశ్చాత్యదేశాల కార్మికులు పరిగణిస్తారు. ఇది చాలా మంచిదే. సోవియట్ కార్మికులకు, ప్రపంచకార్మికవర్గం కాయశక్తులా సహాయపడడానికి సిద్ధంగా వుందని యిది తెలియజేస్తుంది. కాని దీనివల్ల, మనం చాలా పెద్ద బాధ్యతను నిర్వర్తించవలసి వుంది. అంటే, ప్రపంచ శ్రామికవర్గానికి ప్రథమశ్రేణి సేనాని అన్న గౌరవనీయమైన బిరుదుకు మనం అర్హులమని, మన కృషిద్వారా మనం నిరూపించుకోవలసివుంది. మన

దేశంలో సోషలిజం సంపూర్ణ విజయం కోసం, అన్ని దేశాల్లో సోషలిజం విజయం కోసం, యింకా యెక్కువగా కృషిచేయవలసిన బాధ్యతనూ, పోరాడవలసిన బాధ్యతనూ మనం నిర్వర్తించవలసి వుంది.

"కాబట్టి, శ్రామికవర్గ అంతర్జాతీయ ఆదర్శానికి, అన్ని దేశాల శ్రామికుల సౌభ్రాతృత్వ ఐక్యతకూ, మనం త్రికరణశుద్ధిగా కట్టుబడి వుండాలి"

(ప్రాబ్లమ్స్ ఆఫ్ లెనినిజం, మాస్కో ప్రచురణ 1947 పుటలు 518-9)

## శ్రామికవర్గ అంతర్జాతీయవాదం యొక్క ఆవశ్యకత

ప్రపంచానికి చారిత్ర ప్రాముఖ్యత గల సోవియట్ సోషలిస్టు విప్లవ విజయమూ, సోషలిస్టు సమాజ నిర్మాణమూ యేమి తెలియజేస్తున్నవి? ఒంటరిగా, తక్కిన దేశాల శ్రామికవర్గాల ప్రభుత్వ సహకారం లేకుండా, సోవియట్ యూనియన్ వంటి దేశపు కార్మికవర్గం, తన అంతర్గతశక్తితో సామ్రాజ్యవాదాన్ని కూలద్రోసి సోషలిస్టుసమాజాన్ని నిర్మించగలిగిందనీ, సోవియట్ కార్మికవర్గం, అన్ని దేశాల కార్మికులతో అంతర్జాతీయ సంబంధాలను పెట్టుకోవడమే గాక యింకా పెంపొందించు కొంటున్నదనీ పై విషయాలు తెలియజేస్తున్నాయి.

దేశంలోని కార్మికవర్గానికి, సోషలిస్టు నిర్మాణం సాగిస్తున్న, తమ విముక్తి కోసం పోరాడుతోన్న అన్ని దేశాల కార్మికవర్గానికీ, తమ అంతర్జాతీయ సంబంధాలను బలపర్చుకోవలసిన చారిత్రకావశ్యకత యెంతో వుంది. సోషలిజాన్ని సాధించిన సోవియట్ కార్మికవర్గ పోరాటం, శ్రామికవర్గ అంతర్జాతీయవాదం అనే మార్క్సిస్టు నినాదంలో వున్న సత్యాన్ని అమోఘంగా నిరూపిస్తోంది. ఇంతేకాదు ప్రపంచ శ్రామిక వర్గం అంతటికీ చెందిన అంతర్జాతీయులక్ష్యాలకు, బాధ్యతలకూ, సోవియట్ కార్మిక వర్గం చూపుతోన్న సేవాభావానికి, సోవియట్ కార్మికవర్గం పోరాటం, ఒక చారిత్రకమైన ఉదాహరణ.

సోవియట్ సోషలిస్టు విప్లవానుభవం, శ్రామికవర్గ అంతర్జాతీయవాద ప్రాముఖ్యతను నిరూపించింది. ఇది, సామ్రాజ్యవాదాన్ని తోసివేసి, సోషలిస్టు సమాజాన్ని నిర్మించడం విషయంలోనేగాక జాతుల సమస్యను పరిష్కరించడంలోను, నిజమైన స్వాతంత్ర్యాన్ని, జాతీయవిముక్తిని ప్రజలకు సాధించడం విషయంలో కూడా, సోవియట్ సోషలిస్టు విప్లవానుభవం, శ్రామికవర్గ అంతర్జాతీయ ప్రాముఖ్యతను నిరూపించింది.

కామ్రేడ్ స్టాలిన్ ఇలా చెప్పాడు.

"బూర్జువా జాతీయవాద విధానమే, ఒకజాతిని వేరొకజాతిని వేరుచేసే విధానమే, జాతులమధ్య అనైక్యత తెచ్చిపెట్టే విధానమే, వివిధజాతుల శ్రామికప్రజలలో శత్రుత్వాన్ని రెచ్చగొట్టే విధానమే, పీడిత జాతుల విముక్తి విధానమని పూర్వం సర్వ జనాంగీకారమైన భావంగా చెలామణి అయింది. ఈ కాకమ్మకథ యిప్పుడు అబద్ధంగా రుజువైంది"

(ప్రోబ్లమ్స్ ఆఫ్ లెనినిజం, మాస్కో-ప్రచురణ 1947 పుట 201)

జాతీయ సమస్యను జయప్రదంగా పరిష్కరించడంలో, అక్టోబరు విప్లవంయొక్క ప్రబ్రహ్మాండమైన చారిత్రకానుభవం, శ్రామికవర్గ అంతర్జాతీయవాదం యొక్క అపార శక్తిని పూర్తిగా రుజువు చేసింది. కామ్రేడ్ స్టాలిన్ యీ విధంగా చెప్పాడు:

"సోవియట్ యూనియన్‌లోని జాతీయ-వలసదేశాల విప్లవాలను వివిధ జాతుల మధ్య శతృత్వంతోనూ, స్పర్ధలతోనూ గాక, సోవియట్ యూనియన్ లోని వివిధజాతుల కార్మిక కర్షకులమధ్య పరస్పర విశ్వాసంతోనూ, సౌభ్రాతృత్వంతోనే సాధించడం సంభవించింది.

అంటే యీవిజయాన్ని జాతీయవాదం పేరుతోగాక, అంతర్జాతీయ వాదం పేరుతోనే పొందగలిగాం. అక్టోబరు విప్లవంయొక్క ప్రత్యేక లక్షణం యిందులోనే యిమిడివుంది."

—అదే గ్రంథంలో పుట 200

కష్టజీవుల సౌభ్రాతృత్వ ఐక్యతను పెంపొందించే బోల్షివిక్ పార్టీ నాయకత్వాన, కార్మికవర్గం నాయకత్వాన సోవియట్ యూనియన్‌లో జాతులు-వలసరాజ్యాల పీడననుండి, ప్రజలు విముక్తిపొందడం, సరిగ్గా ఈకారణం వల్లనే. మనదేశంలోని ప్రజలందరికీ, హక్కులలో నిజమైన సమానత్వాన్ని, నిజమైన స్వాతంత్ర్యాన్ని కార్మికవర్గం సాధించింది. విషయంలో సోషలిస్టు దృష్టితోను, విధానంలో జాతీయదృష్టితోను గల సోషలిస్టు సమాజాన్ని, సంస్కృతిని నిర్మించే శ్రద్ధగల నిర్మాతలుగా, ప్రజలందర్నీ కార్మికవర్గం తయారు చేసింది. అన్నిరూపాలలో బూర్జువా జాతీయవాదానికి వ్యతిరేకంగా పోరాడడంతోనూ, దురభిమానానికీ, స్థానిక జాతీయవాదానికి వ్యతిరేకంగా పోరాటంతోనూ, ప్రజలమధ్య స్నేహభావం పెంపొందించాలనే లెనినిస్టు - స్టాలినిస్టు విధానానికి లెనిన్‌స్టాలిన్ల పార్టీ గొప్ప విజయాన్ని సాధించింది.

సరిగ్గా అర్థంచేసుకున్నట్టయితే కష్టజీవుల జాతీయ ప్రయోజనాలు వారి అంతర్జాతీయ సామ్యవాద ప్రయోజనాలకంటే వేరు కాదని, లెనిన్, స్టాలిన్‌లు సర్వదా ఉద్బోధించారు. 'రష్యన్ల జాతీయాభిమానం'

అన్న తన ప్రఖ్యాత వ్యాసంలో సరిగ్గా అర్థంచేసుకున్నట్లయితే, రష్యన్ ప్రయోజనాల జాతీయాభిమానం, రష్యన్ సామ్యవాద ప్రయోజనాల కంటే, తదితర శ్రామిక ప్రజల సామ్య వాద ప్రయోజనాలకంటె వేరుగాదని లెనిన్ నొక్కి వక్కాణించాడు.

## శ్రామికవర్గ అంతర్జాతీయవాదం వివిధజాతుల వ్యక్తిత్వాన్ని నిరాకరించదు

శ్రామికవర్గ అంతర్జాతీయ వాదా నికి, జాతీయ శూన్యవాదానికి (నిహి లిజం) ఎలాంటి సంబంధమూ లేదు. శూన్యవాదం జాతిబేధాన్ని అంగీక రించదు. అసలు జాతీయతనూ, జాతి దృక్పథాన్నీ నిరాకరిస్తూ, అదొక పాతకాలపు వెర్రిభ్రమని త్రోసి వేస్తుంది. కమ్యూనిస్టు ఇంటర్ నేష నల్ జనరల్ కౌన్సిల్ సమావేశంలో జాతి అనే దృక్పథమే యీనాడు పనికిరాని ఒక భావమని లాఫర్గు మాట్లాడగా అతన్ని మార్క్సు తీవ్రంగా ఖండించితూ, యీ జాతీయ శూన్యవాదం జాతీయవాదానికి మరొక మారురూపంమాత్రమే నన్నాడు. ఈ సందర్భంలో మార్క్సు యిలా అన్నాడు; "అదంటే ఏమిటో తానే తెలుసుకోకుండా, లాఫర్గు జాతులను నిరాకరించడమంటే వాటన్నింటినీ నమూనా ఫ్రెంచిజాతి తనలో మిళితం చేసుకోవడముగ అర్థం చేసుకొంటున్నాడు."

జాతీయవాదాన్ని మార్క్సిజం-లెనినిజం వ్యతిరేకిస్తుంది. కాని అన్ని ప్రజల జాతీయ ప్రయోజనాలనూ, వారి జాతీయ స్వాతంత్ర్యాన్ని దృఢంగా రక్షిస్తుంది. శ్రామికవర్గ అంతర్జాతీయ వాదాన్నే ఎల్లప్పుడూ తమ ఆదర్శంగా పెట్టుకొని పని జేయడం మూలంగానే, బోల్షివిక్కులు యితరదేశాల ప్రజలతో స్నేహ సంబంధాలను పెట్టుకో గలిగారు. తమ సోసియట్ భూమిని అత్యున్నత దశకు తీసుకొని వెళ్ళి, సోవియట్ యూనియన్‌లో వున్న వివిధజాతుల ప్రజల న్యాయమైన ప్రయోజనాల రక్షణకు పూనుకొన్నారు. బోల్షి విక్కుల నాయకత్వాన మనదేశం లోని కష్టజీవులు ఆర్థిక, రక్షణ బలా లను పెంపొందింపజేసుకో గల్గారు. ఈ బలమే సోషలిస్టు భూమిని ఆర్థిక రీత్యా, మిలిటరీరీత్యా విదేశరాజ్యాల పై పరకంగానూ ఆధారపడకుండా చేయగలిగింది. బోల్షివిక్కులు తమ దేశంయొక్క పూర్తి సేవకూ, మహత్తరమైన రష్యన్ సంస్కృతినీ, సోవియట్ [illegible] యూనియన్‌లోని ఇతర జాతుల [illegible] సంస్కృతు

లనూ అభివృద్ధిపరచి, ఉన్నతస్థాయికి తీసుకొని పోయేందుకూ, తమ ప్రజల యొక్క భౌతిక, నైతిక శక్తులను అభివృద్ధి చేసేందుకూ కష్టజీవులందరినీ సమీకరించారు. ఇందుకోసం వారు సోవియట్ దేశభక్తి అనే పతాకాన్ని చేబట్టారు. ఈ విధంగానే వారు విషయంలో సోషలిజమూ, రూపంలో జాతీయతగల అన్నిజాతుల సంస్కృతులను నిర్మించ గలిగారు. సోవియట్ యూనియన్‌లోని కష్టజీవులు సోవియట్ భూమియెడల అమితమైన భక్తినీ, విశ్వాసాన్ని కలిగి వుండేటట్లు కమ్యూనిస్టుపార్టీ కృషిచేసింది; కృషిచేస్తున్నది.

"సోవియట్ దేశభక్తిలో వివిధ ప్రజలయొక్క జాతీయ సాంప్రదాయలూ, సోవియట్ యూనియన్‌లో కష్టపడి జీవించే ప్రజలందరికి అవసరమైన ప్రయోజనాలూ చక్కగా మేళవించబడ్డా"యని కామ్రేడ్ స్టాలిన్ స్పష్టపరిచాడు. సోవియట్ ప్రజలు మహత్తరమైన చారిత్రాత్మక, సృజనాత్మక కృషి చేసేందుకే బోల్షివిక్కులు సోవియట్ జాతీయాభిమానాన్ని ప్రోత్సహించారు. ఈ సోవియట్ జా[illegible]మానం అభివృద్ధి ని శో[illegible] బూర్జువా సంస్కృతికి వ్యతిరేకంగానూ, దీని ముందు దాసోహమనే తత్వానికి విరుద్ధంగా జరిగే పోరాటంలో ఒక నైతిక ఆయుధంగా వినియోగపడుతుంది. ప్రాచ్యదేశాల సంస్కృతినీ, ముఖ్యంగా రష్యన్ సంస్కృతినీ అసహ్యంగా కొంచెపరస్తూ "పశ్చిమ" రాజ్యాల సంస్కృతి అనబడే దానినంతటిని పెద్దపెద్ద మాటలతో తెగ పొగుడుతూఉండే బూర్జువా జాతీయవాదానికి వ్యతిరేకంగా జరిగే పోరాటంలో బోల్షివిక్‌ల సోవియటు జాతీయాభిమానం అనే నైతిక ఆయుధాన్ని చక్కగా వినియోగించారు. బూర్జువా జాతీయవాదం "పశ్చిమ" దేశాల సంస్కృతి ఉన్నతమైనదనీ దానిముందు అందరూ తలవొంచాలనీ పొగరుబోతు తనంగా బోధించేది. అత్యున్నతమైన అభ్యుదయకర సిద్ధాంతానికీ, సంస్కృతికి మూలపీఠమైన సోవియట్ మాతృభూమి గౌరవాన్ని బోల్షివిక్కులు కాపాడారు; ఇకముందు కూడా కాపాడతారు. సోషలిస్టురాజ్య నిర్మాణ చరిత్రంతా బోల్షివిక్ పార్టీ తన విధానంలో అంతర్జాతీయ కర్తవ్యాలను ఎంత గొప్పగా సమన్వయింప గలిగిందో వివరంగా, విపులంగా చూపెడుతుంది.

ఈ విషయం జర్మన్ ఫాసిస్టు దురాక్రమణ దారులకు వ్యతిరేకంగా సోవియట్ యూనియన్ జరిపిన దేశ భక్తియుతమైన మహాయుద్ధంలో బహుస్పష్టంగా ప్రదర్శితమైంది.

లెనిన్ స్టాలిన్ల పార్టీ నాయకత్వాన సోవియట్ ప్రజలు మహత్తరమైన స్వార్థత్యాగంతో, సోవియట్ మాతృభూమియెడల అకుంఠిత భక్తితో దాని గౌరవం కోసం, స్వాతంత్ర్యంకోసం పోరాడి, సోవియట్ యూనియన్ ప్రజలయొక్క జాతీయ సంస్కృతినీ, ఆ రాజ్యం యొక్క అస్తిత్వాన్ని కాపాడగలిగారు. యుద్ధకాలంలో సైనికులకూ, ప్రజలకూ కావలసిన ఆహార పదార్థాలూ, యితర పరికరాలనూ ఉత్పత్తిచేసి ఎప్పటికప్పుడు అందజేయడంలోగల దీక్షలోనూ, యుద్ధరంగంలో సోవియట్ వీరులు ప్రదర్శించిన అత్యద్భుత పోరాట పటిమలోనూ సోవియట్ దేశభక్తిలోగల బ్రహ్మాండమైన శక్తి ప్రదర్శితమైంది.

## ఇతరదేశాల విముక్తికి సోవియట్ చేసిన కృషి

అంతేకాదు; హిట్లర్ దురాక్రమణకు గురిఅయిన యితర స్వాతంత్ర్యాభిలాషులైన ప్రజలకు సౌభ్రాతృత్వ దృష్టితో సోవియట్ ప్రజలు నిస్వార్థమైన మహత్తరమైన సహాయం చేశారు. గొప్ప దేశభక్తియుతమైన యుద్ధంలో సోవియట్ ప్రజలు గడించిన విజయాలనుండి హిట్లర్ ముఠా బానిసత్వానికి వ్యతిరేకంగా పోరాడుతున్న ప్రజల జాతీయవిముక్తి ఉద్యమాలు రాజకీయ, నైతికశక్తిని పొందాయి. సోవియట్ యూనియన్ యొక్క మిలిటరీ సహాయంలేకుండా యీ ప్రజలు జర్మన్ ఫాసిస్టు దురాక్రమణదారుల బారినుండి తప్పించుకోగలిగెడువారు కాదు.

సోవియట్ సైన్యాల మహత్తర విజయాలఫలితంగా, వారి వీరోచిత కృషిఫలితంగా పోలండు, ఫిన్‌లాండ్, రుమేనియా, బల్గేరియా, యుగోస్లావియా, అల్బేనియా, హంగరీ దేశాలు జర్మన్ దురాక్రమణదారులను వెళ్ళగొట్టగలిగాయి. ఆ దేశాలలోని ప్రజలు యితరుల సహాయం లేకుండా ఫాసిస్టు బానిసత్వాన్నుండి తమంతటతాముగా విముక్తిపొందగల స్థితిలోలేరు. సోవియట్ సైన్యం యొక్క ధైర్యస్థైర్యాల మూలంగానే యూరప్ నాగరికత ఫాసిస్టు ఖూనీకోరులనుండి రక్షించబడింది. ఈ సందర్భంలోనే కామ్రేడ్ స్టాలిన్ యిలా అన్నారు:

"ఇందులోనే మానవజాతి చరిత్రకు సోవియట్ ప్రజలు చేసిన మహత్తరసేవ యిమిడివుంది."

లెనిన్, స్టాలిన్ల పార్టీ నాయకత్వాన సోవియట్ వ్యవస్థ ప్రాతిపాదికపై, వివిధజాతుల ప్రజల సౌభ్రాతృత్వంతో కూడిన స్నేహపూర్వక సంబంధాల మూలకంగా సోవియట్ యూనియన్ ఒక అజేయశక్తిగా తయారైంది. ఇందువల్లనే సోవియట్ ప్రజలు యితర ప్రజలకు యీ గొప్ప సహాయం చేయగలిగారు. అదేకాదు. శ్రామికవర్గ అంతర్జాతీవాదంయెడల అకుంఠిత భక్తినీ, వివిధప్రజలమధ్య స్నేహవిశ్వాసాలు సోవియట్ ప్రజలు కలిగివుండేటట్లు, వారికి బోల్షివిక్ పార్టీ ఎడతెగని తర్ఫీదును యిచ్చింది. దీనిమూలంగా సోవియట్ ప్రజలు తమకుగల అంతర్జాతీయ బాధ్యతలను సక్రమంగా గుర్తించగలిగారు. అందువల్లనే సోవియట్ ప్రజలు యీ సహాయాన్ని చేయగలిగారు.

సోవియట్ ప్రజలు యితర ప్రజలకు చేసిన సహాయంలోగల అంతర్జాతీయ స్వభావం తరువాత జరిగిన ఘటనలు స్పష్టంగా రుజువు చేశాయి. ఫాసిస్టు బానిసత్వాన్నుండి సోవియట్ సైన్యంచే విముక్తి చేయబడిన దేశాలలో కార్మికవర్గం ప్రజాసామ్యానికి ముందు నిలబడి, నాయకత్వం వహించి, వారిని నిజమైన ప్రజాస్వామిక ప్రజాతంత్రానికి జయప్రదంగా తీసుకొని వెళ్ళే బాటను నడిపిస్తోంది. ఈ విధంగా ఆ దేశాలలో సోషలిస్టు పునర్నిర్మాణానికి అవసరమైన పరిస్థితుల సృష్టించబడుతున్నాయి. ఇతర ప్రజలకు సోవియట్ ప్రజలు చేసిన సహాయం ఆయా దేశాల ప్రజలు స్వాతంత్ర్య సౌభాగ్యాలను అనుభవించాలనే సౌభాతృత్వ దృష్టితో చేయబడింది. ఈ సౌభాతృత్వ దృష్టి సోవియట్ యూనియన్ ఆ దేశాలతో చేసుకొన్న ఒడంబడికలలో స్పష్టంగా వెల్లడి అయింది. ఈ ఒడంబడికలపైన జరిగిన సంతకాలు "అన్ని దేశాలు సమానం" అన్న ప్రాతిపదికను ఆధారం చేసుకొని జరిగాయి. ఈ సత్యాన్నే కామ్రేడ్ స్టాలిన్ చెప్పినట్లు, ప్రపంచ సంస్కృతి అనే అందరి సొత్తుకు ప్రతి ఒక్క దేశమూ తనవంతు భాగాన్ని కలుపుతుంది. ఈ విధమైన దృష్టితో చూస్తే అన్ని దేశాలూ – పెద్దవి, చిన్నవి కూడా – ఒకే సమానమైన స్థితిలో వున్నాయి. అంటే ఒక దేశం ఎంత ముఖ్యమో, మరొక దేశం కూడా అంతే ముఖ్యం.

అక్టోబరు సోషలిస్టు మహావిప్లవం జరిగిన తరువాత, యీ ముప్పది

సంవత్సరాల దీర్ఘచరిత్ర అంతర్జాతీయ సంఘటనయొక్క ప్రాముఖ్యతకూ, సోషలిజమూ, ప్రజాతంత్రంల కోసం అంతర్జాతీయ వాదంయొక్క అవసరానికీ ఒక్క చక్కటి నిదర్శనం మానవజాతి పురోభివృద్ధికి సోవియట్ యూనియన్ ను బలపరచుకోవడం అత్యంత ముఖ్యమైన విషయంగా పరిగణించాలి. 1927లో కామ్రేడ్ స్టాలిన్ యిలా రాశాడు :

> "అసలు 'బోల్షివిక్, రాజ్యమంటూ ఉంటడమే, అభివృద్ధి నిరోధక దుష్టశక్తులకు ఒక పెద్ద ఆటంకం అనేవిషయాన్ని మరచిపోరాదు. పీడితవర్గాలు తమ విముక్తి కోరకు జరిపే పోరాటాలకు ఆ విధంగా బోల్షివిక్ రాజ్యం సాయపడుతుంది."
>
> —ప్రోబ్లిమ్స్ ఆఫ్ లెనినిజం పేజీ 203

ఇంతవరకూ జరిగిన కాలంలో సోవియట్ యూనియన్ పోరాట విజయాల మార్గాన బ్రహ్మాండంగా పురోగమించింది. అంతర్జాతీయ వ్యవహారాలలో అదిఒక అత్యంత ప్రధాన శక్తిగా పరిణితి చెందింది. ప్రజాస్వామిక సామ్రాజ్యవాద వ్యతిరేక శిబిరానికి అందరినీ సమీకరించగల ఒక మహత్తర శక్తిగా తయారయింది పీడిత జాతులు విముక్తి పొందడానికీ, ప్రజాతంత్ర రాజ్యాలన్నీ తమ జాతీయ సర్వస్వతంత్రాలను కాపాడుకోవడానికీ ప్రజాస్వామిక సోషలిజం అజేయం జయప్రదం కావడమే నిజమైన ప్రాతిపదిక.

ఇదంతా శ్రామికవర్గ అంతర్జాతీయవాదంయొక్క మహత్తర శక్తిని రుజువుచేస్తోంది. కష్టజీవుల విముక్తి ఉద్యమాలకీ, వర్గపీడన నుండి, జాతిపీడననుండీ విముక్తి పొందడానికీ యజమానులూ బానిసలూ, పరపీడనా దౌర్జన్యాలూలేని నూతన జీవితాన్ని నిర్మించుకోడానికీ శ్రామికవర్గ అంతర్జాతీయవాదం ఒకమహత్తరమైన సాధనం.

* * *

మరోవైపున చరిత్రలో గడచిన గతశతాబ్దం బూర్జువా జాతీయవాదం యొక్క అభివృద్ధి నిరోధక స్వభావాన్ని, సంపూర్తిగా బట్టబయలు చేసింది. అది మానవులను ద్వేషించే కిరాతక సిద్ధాంత స్థితికి దిగజారిపోయింది. కార్మికవర్గ ఉద్యమాన్నీ, ప్రజలందరి జాతీయ స్వాతంత్ర్యాన్నీ నాశనంచేసే పిచ్చిపాలసీక్రిందకు దిగజారిపోయింది.

సామ్రాజ్యవాదయుగం, యిదివరకెన్నడూ ఎరగనంత అసహ్యాకరంగా బూర్జువా జాతీయపోకడలు తలెత్తడానికి కారణభూతమైంది. చిట్టచివరకు యీ బూర్జువా జాతీయవాదం

విపరీతమై, జాతివిద్వేషాలకు దారితీసే ఫాసిస్టుస్వరూపం దాల్చింది. కడకు కష్టజీవుల స్వాతంత్ర్యానికీ, అసలు అభ్యుదయ మానవజాతిఅస్తిత్వానికే యీ బూర్జువా జాతీయవాదం ఒక భయంకర ప్రమాదంగా తయారయింది.

రెండో ప్రపంచయుద్ధ ఫలితంగా ఫాసిజం నైతికంగానూ, రాజకీయం గానూ ఓటమి చెందింది. కాని సామ్రాజ్యవాద అభివృద్ధినిరోధక ముఠా పూర్తిగా అట్టడుగునపడి పతనం చెందినతరువాత మాత్రమే అది జాతి విద్వేషాన్ని, బూర్జువా జాతీయవాదాన్ని తన ఆయుధాలుగా వదులుకుంటుంది.

## జాతి విద్వేష ఉద్యమానికి అమెరికా నాయకత్వం

ప్రస్తుతం జాతీయవాదం అనే సిద్ధాంతానికి ప్రధానంగా అమెరికా ప్రాతినిధ్యం వహిస్తున్నది. అంతే కాదు. అక్కడ జాతీయవాదం పైశాచిక తీవ్రరూపంతో ప్రత్యక్షమైంది. యుద్ధానికిముందు జాతివిద్వేషాలకూ, జాతీయవాదానికి యింకా యితర అభివృద్ధినిరోధక సిద్ధాంతాలకు ఫాసిస్టు జర్మనీ, ఇటలీ, జపానులు ఆటపట్టుగా వుండేవి. ఈనాడు నూతన ఆంగ్లో - అమెరికన్ జాతీయ తత్వానికీ బూర్జువా జాతీయ వాదానికీ అమెరికా నిలయమైంది. అమెరికాలో ఆంగ్లో - శాక్జన్ జాతీయతత్వం ఒక సిద్ధాంతాన్ననుసరించి ప్రచారం చేయబడుతున్నది. ఆ సిద్ధాంతంప్రకారం అన్నిజాతులూ తమ తమ ప్రత్యేక స్వభావాలను విసర్జించి, 'అమెరికాతత్వం' (అమెరికనైజేషన్)ద్వారా వ్యక్తిత్వం లేకుండా ఒకటిగా మిళితమైపోవాలని ఉద్దేశించబడింది. ఆంగ్లో - శాగ్జన్లు మాత్రం యీవిధంగా వ్యక్తిత్వం లేకుండా మిళితమైపోయే పరిణామానికి గురికారాదు. యుద్ధానంతరం అమెరికాలో "అమెరికా వ్యతిరేక చర్యల విచారణ సంఘం" అధికారులలో ఒకడైన రాన్‌కిన్‌లాంటి వారు, జాతి విద్వేషాన్ని పురికొల్పే ప్రకటనల నివ్వడం మామూలై పోయింది. ఉదాహరణకు అమెరికాలోని రాన్‌కిన్ యిలా అన్నాడు.

> "నేను అమెరికావాసిని మాత్రమే కాదు. నేను ఆంగ్లోశాగ్జన్ జాతికిచెందిన వాడిని. మన నాగరికతను సృష్టించినజాతికి చెందిన వాడినినేను."

ఈ "అమెరికాతత్వం" (అమెరికనైజేషన్) అనే సిద్ధాంతం, నిజానికి ఇంగ్లీషు భాషను మాట్లాడని జాతుల రాజ్యాల అస్తిత్వాన్ని, వివిధ ప్రజల జాతీయ సంస్కృతులనూ పూర్తిగా

లేకుండా రద్దుచేసే సిద్ధాంతం ఈ సిద్ధాంత ప్రచారకులు ప్రజలలో తమ జాతీయ ప్రయోజనాలయెడల అలక్ష్యం ఏర్పడేటట్లు చేస్తున్నారు. జాతీయ చైతన్యమూ, జాతీయస్వభావాలూ ప్రస్తుతం వుంచుకో దగినవి కావనీ, వాటిని పాతరికార్డులుగాదానే గదిలో పారవేయవలసిన వనీ, యీ "అమెరికా తత్వ" ప్రచారక బృందం ప్రకటిస్తున్నారు. ప్రజలు తమ జాతీయ స్వాతంత్ర్యాన్నీ, జాతీయ సర్వస్వాతంత్ర్యాన్నీ కాపాడుకోనేందుకు ప్రయత్నించడమే ప్రస్తుతం చెముటలకూ, ప్రమాదాలకూ, యుద్ధాలకూ, యింకా యితర కుట్రలకూ కారణమని వారు ప్రచారం చేస్తున్నారు. "జాతీయ భావం" అన్నదానికి దిజాతీయేతర, * "కాస్మో పోలిటన్ భావా"న్ని ప్రతికూల ఆయుధంగా పెడుతున్నారు "అమెరికా తత్వ "మే సర్వమనీ, యితర దేశాలకు సంబంధించినదంతా శూన్యమని చెప్పే యీ "కాస్మోపోలిట నిజం" ఏమి తెలియజేస్తుంది? అది జాతి దేషతత్వమూ, మూఢత్వంతో కూడిన దురాక్రమణ బూర్జువా వాదం జాతీయ సామ్రాజ్య వాదం తప్ప మరొకటి కాదు, "కాస్మో పోలిటన్ భావం" ముసుగు క్రింద "ట్రూమన్ సిద్ధాంతాన్ని", "మార్షల్ ప్లాను"నూ యింకా అమెరికా సామ్రాజ్యవాదం యొక్క దురాక్రమణ పంథా యితర పోకడలనూ కొనసాగించడానికి చక్కగా వీలవుతుంది. ఇతర జాతులను అణచడం, జాతీయ సర్వస్వాతంత్ర్యం యెడల, జాతీయ హక్కులు, గౌరవంయెడల ప్రజల ఆత్మగౌరవం యెడల అసహ్యభావాన్ని ప్రేరేపించే "అమెరికా తత్వం" యొక్క సిద్ధాంత ఆచరణలకు వంత పాడటానికే యీ "కాస్మో పోలిట నిజం" సిద్ధాంతాన్ని వినియోగిస్తున్నారు.

## "అమెరికనిజం" యొక్క అసలు రంగు

జర్మన్ సామ్రాజ్యవాదానికి అది పుట్టినప్పటినుండీ దాని అవసరాలకు ఉపయోగపడిన "జర్మనిజం", "జర్మనైజేషన్" లాంటి వాటికంటే యీనాడు "అమెరికనిజం" "అమె

* "కాస్మో పోలిటనిజం:" దేశమూ, మతమూ అనే భేదంలేకుండా లోకమంతా ఒకటే నని చెప్పే తత్వం.

రికన్నైజేషన్" * అనే సిద్ధాంతాలు ఏవిధంగానూ మెరుగుకాదు.

"అమెరికనిజం", "అమెరిక న్నైజే షన్" అనేసిద్ధాంతాన్ని స్వదేశంలో అభ్యుదయ శక్తులన్నింటినీ అణచివార వేసి, ఇతర దేశాల ప్రజలపై వొత్తిడి తెచ్చి, వారిని విచ్చలవిడిగా దోపిడీ చేసే అభివృద్ధి నిరోధక నియంతృత్వ ధోరణిని సమర్థించుకొనేందుకు సృష్టించారు. అమెరికాలోని అభ్యుదయకర శక్తులన్నింటినీ తమ "జాతీయసిద్ధాంతం" గా ప్రకటించబడిన "అమెరికనిజం" "అమెరిక న్నైజేషన్" వ్యతిరేకుల జాబితాలోకి ఎక్కించుతున్నారు. దేశంలో తాండవిస్తున్న అభివృద్ధి నిరోధక పాలసీకి వ్యతిరేకంగా నోరెత్తిన అభ్యుదయ శక్తులనన్నింటినీ నాశనం చేసేందుకు వీలుపడే ఒకసాధనంగా బూర్జువా జాతీయవాద మూఢ సిద్ధాంతాన్ని వినియోగిస్తున్నారు. ఈనాటి అమెరికాలోని "బ్లాక్‌హాండ్రెడ్స్" సోషలిజానికి, ప్రజాస్వామిక ఆశయాల యెడల సానుభూతిని చూపెట్టినంతమాత్రాన "ద్రోహం" క్రింద లెక్కకట్టి దేశంలో ప్రముఖ అభ్యుదయ కాముకులందరినీ "అమెరికానిజం" "అమెరికన్‌తత్వాలు" మొదలుగాగల సిద్ధాంతాల రక్షణపేరిట వేటాడుతున్నారు. జాతీయవాదం, జాతీయ దురభిమానపోకడలూ రోజురోజుకు మరింత విచ్చలవిడిగా అమెరికాలో చెలరేగుతున్నాయి. దేశదురభిమానమే ఈనాడు అమెరికా పాలక వర్గాల అధికారపాలసీయొక్క ప్రధాన లక్షణం. "అమెరికా సొసైటీ ఆఫ్ ది ఫ్రండ్స్ ఆఫ్ డెమోక్రసీ" నాయకులలో ఒకడైన యల్ బిర్కిహెడ్ 1946 నాటికి జాతీయవాదాన్నీ, జాతి విద్వేషాన్ని రెచ్చగొట్టే వివిధసంస్థలలో సభ్యులుగా వున్నవారి సంఖ్య 800 కు పైగా వున్నదని అంచనావేశాడు. ఈ సంస్థలు అనేకపేర్లతో అనేక ముసుగులతో వ్యవహరిస్తాయి. "క్రాస్ అండ్ ఫ్లాగ్" శాసనబద్ధులు", "దేశభక్తి పరిశోధనా బ్యూరో," "క్రిస్టియన్ ఫ్రంట్", "ఫ్రండు పర్ అమెరిక న్నైజేషన్", "జాతీయ వాదులు — "రెండోప్రపంచయుద్ధ వీరులు" "క్రిస్టియన్లు – అమెరికా వీరులు" మొదలగు పేర్లతో వీరు వ్యవహరిస్తున్నారు. దేశంలో వివిధ ప్రాంతాలలోవున్న 241 సంస్థలను విచారించగా అందులో 89 సంస్థలు

* అమెరిక న్నైజేషన్ : ప్రపంచ మంతటినీ అమెరికా తత్వంతోనూ, అమెరికా ప్రభావంతోనూ నింపడం, దీనిని ప్రచారంచేసి ఆచరణలో పెట్టేదాన్ని అమెరికనిజం"అని అంటారు

తమవద్ద పనిచేసే వ్యక్తులు "అమెరికా రాజ్యానికీ, అమెరికా "మతానికీ" చెంది ఉండాలని నిర్బంధిస్తున్నట్లుగా స్పష్టపడింది. "తెల్లజాతి వారికీ, ఆంగ్లో - శాక్సన్ జాతివారికీ, ప్రొటెస్టెంటు మతం వారికి మాత్రమే ఉద్యోగాలిస్తామనే ప్రకటనలు నేను అమెరికా వార్తాపత్రికలలో విపరీతంగా కనపడుతున్నాయి. చికాగోలో నూటికి 97 వ్యాపారసంస్థలు పైన చెప్పబడిన షరతులను తృప్తి పరచగలవారిని మాత్రమే తమవద్ద ఉద్యోగులుగా చేర్చుకొంటున్నాయి.

## జాతీయవాదం అంతర్జాతీయ కార్మికుల ఐక్యసంఘటనను విచ్ఛిన్నంచేస్తుంది

జాతివైరుధ్యాలను రెచ్చకొట్టడం ద్వారానే, బూర్జువావర్గం ఎల్లప్పుడూ కష్టజీవులైన జనసామాన్యాన్ని వర్గ పోరాటానికి దూరంగా ఉంచడానికి ప్రయత్నించుతుంది. ఈ విధంగా నానాటికి తీవ్రతరమవుతున్న వర్గ పోరాటానికి బదులుగా వివిధజాతులకు చెందిన కష్టజీవులమధ్య తగాయిదాలను పెంచి, ఆ రకమైన జాతివిద్వేష పోరాటాలకు ప్రజానీకాన్ని మరల్చడానికి తీవ్రప్రయత్నాలు చేస్తారు. ఈవిషయంపై కామ్రేడ్ స్టాలిన్ యిలా చెప్పారు:

"రైతాంగమూ, (యితర ఛోటా బూర్జువా వర్గాలూ) జాతీయ దురభిమానాలను పూర్తిగా కలిగి ఉండి, బూర్జువా వర్గాన్ని అనుసరిస్తున్నంత కాలమూ, తమ జాతి గొప్పదనే దురభిమానాలూ, జాతుల మధ్య పోరాటాలూ తప్పనిసరిగా ఉంటాయి. అవి రాకుండా చేయడం అసాధ్యం. కాని రైతాంగం శ్రామికవర్గాన్ని అనుసరించిన పక్షంలోనే వివిధ జాతుల మధ్య శాంతినీ, జాతుల స్వాతంత్ర్యాన్ని గ్యారంటీ చేయడానికి తప్పకుండా వీలవుతుంది."

—కలెక్టెడ్ వర్క్సు, రష్యన్ ఎడిషన్, సంపుటి 5 పేజీ 19

పట్టణాలలోనూ, పల్లెలలోనూ, ఉండే ఛోటా బూర్జువావర్గ ప్రజలలో జాతీయ దురభిమానాలను రెచ్చగొట్టి వృద్ధి చేయడానికి బూర్జువావర్గం ఎల్లప్పుడూ తంటాలు పడుతుంది. ప్రజాస్వామిక, సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తుల శిబిరం అంతర్జాతీయంగానే కాకుండా అమెరికాలోకూడా సంఘటితపడుతున్న యీ పరిస్థితులలో - అమెరికా సామ్రాజ్యవాదులు జాతి విద్వేషాలను రెచ్చగొట్టడంద్వారా, యీ సంఘటన నిర్మించబడకుండా ఆటంకపరచడానికీ, దాన్ని వెనక్కు నెట్టడానికి, వీలయితే దాన్ని విచ్ఛిన్నం చేయడానికి తీవ్రప్రయత్నాలు చేస్తున్నారు. "విభజించి పరిపాలించు" అనే ప్రాచీనరోమ్‌లోని బానిసయజమానుల పాతసూత్రాన్ని,

అమెరికా సామ్రాజ్యవాదులు యుద్ధానంతరపరిస్థితులలో ముఖ్యంగా ఆదరించి, అనుసరిస్తున్నారు.

## డాలర్ జాతి విద్వేషకులు హిట్లర్‌ను మించారు

పెట్టుబడిదారీ విధానం యొక్క చరిత్రలో సిగ్గుతో తలవంచుకోవలసిన కొన్ని ఘటనలు, అమెరికా కిరాత పాలనకు సంబంధించి ఉన్నాయి. ఈ రాక్షసపరిపాలనఫలితంగా అమెరికన్ ఇండియన్‌లనే స్వదేశ జాతి ప్రజలను సమూలంగా నాశనం చేయడం జరిగింది. ఇంతటి ఘోరం, అసలు ఒకజాతినే ధ్వంసం చేయడం – మరెచ్చటా జరిగి ఉండదు. 30 లక్షల జనాభావున్న అమెరికన్ ఇండియన్ జాతి యీ నాడు మూడు నాలుగు లక్షల జనాభాకంటే ఎక్కువుండదు. దరిద్రం, బాల్యంలోనే చావులు మితిమీరడం, క్షయవ్యాధి యివన్నీ యీనాటికే ఉత్తర అమెరికా ఇండియన్‌లను విపరీతంగా తమ పొట్టను పెట్టుకొన్నాయి. ఈ కిరాతపాలసీ ఫలితాలను గురించి వివరించుతూ ఒక అమెరికన్ సమాజిక శాస్త్రవేత్త యిలా రాశాడు.

"తాను చేయడానికి సాధ్యపడితే హిట్లర్ యూరప్‌కూ మనకూ ఏమిచేసి వుండేవాడో, ఆ పనిని తెల్లవాళ్ళమైన మనం యీ వంద సంవత్సరాలలో (అమెంకాలోవున్న) ఇండియన్ జాతికి చెందిన వేలకొలది ప్రజలకు చేశాం. 'లంగ్' 'మాయాస్' 'అజ్‌టిక్' జాతులప్రజల నాగరికతకు తెల్లవాళ్ళమైన మనం ఏమి చేశామో, లేక ఉత్తర అమెరికాకు చెందిన తెల్లవారమైన మనం అట్లాంటిక్ మహాసముద్రతీరాన గ్రేట్ ప్రైరీసీనవున్న ఇండియనుల నాగరికతకు ఎంతటి అపకారం చేశామో అంతటి దారుణం హిట్లర్ తాను ఆక్రమించిన పోలండ్ ప్రజలకూ, యూదులకూ, లేక యితర ప్రజాతంత్ర దేశాల ప్రజలకు చేయాలని తన మనస్సులో తలచనైన తలచి ఉండడు."

మొత్తం జాతుల జాతులనే సర్వనాశనంచేసే యీ పాలసీని, "అనాగరికుల" నుండి "అమెరికా" నాగరికతను కాపాడేందుకు అనుసరించబడుతున్నదనే అబద్ధ పదాడంబరాల ముసుగుకింద, ఎల్లప్పుడూ సామ్రాజ్యవాదులు చెలామణిచేస్తారు. సుప్రసిద్ధ అమెరికన్ రచయిత హోవార్డు ఫాస్ట్ "ది లాస్టు ఫ్రాంటియర్" అనే తన గ్రంథంలో 19 వ శతాబ్దం ఆఖరులో ఒక ఇండియన్ కొండజాతి అనుభవించిన దుర్భరపరిస్థితిని యీ క్రిందివిధంగా వర్ణించాడు:

"కొందరు ఆకలిబాధతో అలమటించి చచ్చిపోయారు; మరికొందరు మలేరియాతో మరణించారు; ఇంకా మరికొందరు ఎనుబోతులకింద వేటాడబడి చంపబడ్డారు. వాస్తవా

సికి ఆ ప్రదేశంలో మనుబోతులు లేనేలేవు." ఈ విధంగా గండయాత్రలు జరిపి జాతిని సమూలంగా నాశనంచేశారు. ఈనాడు అమెరికా రాజ్యాంగంలోనూ, రాజకీయజీవిత విధానంలోనూ ఒక శాశ్వతలక్షణంగా పరిణమించిన జాతివిభేదాలను కొనసాగించడాన్ని చూసి, కొంత మంది బూర్జువా రచయితలూ, మానవ శాస్త్రవేత్తలూ సహితం సహించలేక తమ అసమ్మతిని ప్రకటించారు. ఉదాహరణకు, సామ్రాజ్యవాదులు నీగ్రోలలో యాంటీసెమిటిజాన్ని ప్రవేశపెట్టారనీ, అమెరికా యూదులలో నీగ్రోలంటే ద్వేషం కలిగేటట్లు పురిగొల్పారనీ, అమెరికా రచయిత యస్. బెనన్ బామ్ బయటపెట్టాడు. ఇక "తెల్లవారి" లో బానిసత్వ వ్యతిరేకత, ఫ్రెంచివ్యతిరేకత, ఇటాలియన్ వ్యతిరేకత-యింకా వలసవచ్చిన అనేక జాతులయెడ వ్యతిరేకతాభావాన్ని ప్రవేశపెట్టబడింది. ముఖ్యంగా అమెరికాలో నివసించే మెక్సికో దేశస్తులను విపరీతంగా ద్వేషించడాన్ని ప్రచారంచేశారు. నీగ్రోలు నివసించే ప్రదేశాలలోనేగాక మెక్సికో దేశస్తులు ఉండే స్థలాల్లోకూడా దరిద్రదేవత తాండవిస్తోంది. గుడారాల్లోనూ, పాతబడి చెడిపోయిన రైల్వే వాగన్లలోనూ, గుడిసెల్లోను పూరికొంపలలోనూ వాళ్ళుకాలక్షేపం చేస్తున్నారు. స్కూళ్ళుమృగ్యం. నిరక్షరాస్యతరాజ్యం చేస్తోంది. మెక్సికన్ దేశస్థులకోసం స్కూళ్ళు స్థాపించకపోవడాన్ని సమర్థించుతూ వారు వెక్కిరిస్తారు. మెక్సికన్లు "ఇంగ్లీషును నేర్చుకొన్నట్లయితే వారు యజమానులు అవ్వాలని కోరతా" రట. ఇంకా బెనన్ బామ్ చెప్పుతూ యీ విధంగా ముగిస్తాడు. "ఈవిధంగా ఒకదాని మూలంగా మరొకటి చక్రంలాగా తిప్పబడుతుంది. దరిద్రం, అజ్ఞానం, దరిద్రం, ఇంకా ఎక్కువ అజ్ఞానం, యింకా దరిద్రం. లాస్ ఏంజిల్సులో వున్న మెక్సికన్లు "తెల్ల" వారుగా పరిగణించబడినప్పటికీ హోటళ్ళలో, సినిమాహాలులల్లో, నాట్యమందిరాలల్లో వారు "తెల్ల" వారితో "కలసి" ఉండటాన్ని నిషేధించారు.

## అమెరికాలో జాతి విద్వేషం పరకాష్ట చెందింది

అమెరికాలో నీగ్రోల యెడల ఏ విధంగా జాతి విద్వేషాన్ని ప్రదర్శించి, వారిని నానాబాధలు పెడుతున్నారో ప్రపంచ మంతటికీ తెలుసు. నీగ్రోలను సిగ్గు విడిచి న్యాయానికి విరుద్ధంగా విపరీతమైన అగచాట్లకు

గురిచెయ్యడం – వీటన్నింటినీ చట్టసమ్మతం చేయడం, అందు కనుకూలమైన శాసనాలనే చేయడం, "తెల్లవారి" ముందు వారిని పురుగులుగా చూడటం అంతా ప్రపంచానికి తెలుసు. యుద్ధానంతరం అమెరికాలో యీ జాతి విద్వేషం యెంతటి దారుణ పరిస్థితులకు వెళ్ళిందో, ఒక్కొక్కప్పుడు వర్ణించడమే కష్టం. ఉదాహరణకు ఒక నీగ్రో స్త్రీ రోడ్డుపైన యేదో ప్రమాదానికి గురికాగా, ఆమెను ప్రక్కనున్న ఆసుపత్రిలో జేర్చుకోడానికి నిరాకరించబడింది. ఎందుకంటే ఆ ఆసుపత్రి "తెల్ల" వారికి మాత్రమేనని సంజాయిషీ చెప్పబడింది. దాని ఫలితంగా ఆ నీగ్రో స్త్రీ బజారులోనే అలాగే పడివుండవలసి వచ్చింది. 1942 లెక్కలు ప్రకారం అమెరికాలో ఒకకోటి 30 లక్షల జనాభాగల నీగ్రోలకు 110 అసుపత్రులున్నాయి. అంటేపదిలక్షల నీగ్రోలకూ 75 ఆసుపత్రి మంచాలు మాత్రమే ఉన్నాయి.

నీగ్రోలపై జరిగే దౌర్జన్యాలను గురించిన ఘటనలు అమెరికా పత్రికలలోమామూలుగా పడుతుంటాయి. నీగ్రోలను నౌకర్లగానూ, పనివారలుగానే అమెరికాలో "ఉండనివ్వ" వచ్చునని జాతీయ వాదులు ప్రచారం చేస్తారు. ఒక నీగ్రో మేధావి యిలా అన్నాడు: "తెల్లవానితో నేను మాట్లాడకోరితే, గుమ్మంవద్ద కాపలా వుండే నౌఖరు ధరించే టోపీని పెట్టుకోవలసిఉంటుంది. అప్పుడంతా సవ్యంగా జరుగుతుంది." ఉన్నత విద్యను అభ్యసించడానికి అవకాశంకలిగిన ఎవరో కొద్దిమంది నీగ్రోలుకూడా, హోటళ్లలో కాపలా మనుష్యులుగా పనిచేయవలసివస్తోందని ప్రొఫెసర్ బెర్సి బయటపెట్టాడు.

అమెరికా సాంఘిక జీవితమంతటకీ బూర్జువా – జాతీయవాద ప్రచారం వ్యాపించింది. స్కూళ్ళలో జాతి వైరుధ్యాలు ప్రోత్సహించబడతాయి. కాలేజీలలోను, విశ్వవిద్యాలయాలలోనూ యీ విషపూరితమైన 'అభిప్రాయాల' వేళ్ళు లోతుగా పాతుకు పోయాయి. రేడియోలో, సినిమాలో పత్రికల్లో, సాహిత్యంలో – ప్రతిచోటా యీవిధమైన జాతివిభేదాలు, జాతివిద్వేషాలూ ప్రచారం చేయబడుతున్నాయి. అమెరికా సినిమా చిత్రాలలో నీగ్రోలను నౌఖర్లుగానూ హాస్యకారులుగానూ, కాపలా మనుష్యులుగా పనిపెట్టుకొని అదేపనిగా చిత్రించడం జరుగుతున్నదని అమెరికా రచయిత సెనన్‌బామ్ పేర్కొన్నాడు. అదే విధంగా, ఇటలీ జాతి

ప్రజలను బందిపోటు దొంగలగానూ, పచ్చగడ్డి అమ్ముకొనే వారిగానూ, అనారోగ్య కరమైన గుడిసెలో నివసించే వారుగానూ, – చైనావారిని దోపిడీ దొంగలగానూ, ఖూనీకోర్లుగానూ, నల్లమందు గోదాలను కాపలా కాసేవారుగానూ, వస్తువులను రహస్యంగా దొంగిలించేవారిగానూ చిత్రించుతున్నారు. సినిమా చిత్రంలో నాయకుడిని తప్పనిసరిగా ఆంగ్లో – శాగ్జన్ జాతికి చెందిన వాడుగా చిత్రిస్తారు. సద్గుణవంతుడుగానూ, జయాపజయాలను ఒకటిగానే సంతోషంగా స్వీకరించే స్వభావం గలవాడుగానూ, ఉన్నతభావాలు గలవాడుగానూ తప్పకుండా అతణ్ణి చిత్రిస్తారు. ఆ నాయకుణ్ణే వ్యతిరేకించేవాడిని తప్పనిసరిగా "అసహ్యాదుస్తులతో వుండే ఒక విదేశీయుడుగా చిత్రిస్తారు. అతడు ఇంగ్లీషు భాషను అపస్వరాలలో మాట్లాడేవాడిగా చిత్రిస్తారు." ఈ జాతీయవాదమనేవిషాన్ని సినిమా, రేడియో పత్రికలద్వారానే ప్రచారంచేయడం గాకుండా అనేక అమెరికన్ తప్పుడు శాస్త్రగ్రంథాలద్వారా ప్రచారం చేస్తున్నారు. ఈ తప్పుడు శాస్త్రీయ గ్రంథాల్లో "మానవజాతి వివిధ తెగలుగా విభజించిఉండి, వాటివాటి యొక్క చెడు, మంచి లక్షణాలను సంక్రమించు కుంటాయి" అని "రుజువు"చేసి ప్రచారం చేస్తున్నారు.

ఈ ఫాసిస్టు కారు కూతల నన్నింటినీ, వేల కొలది డబ్బుకు కక్కుర్తి పడే రచయిత లంతా వ్యాపింప జేస్తారు. వారు తమ పాఠకులకు నీగ్రోలు "ఆర్థిక సంపాదన" ప్రయత్నంలో వట్టి అసమర్థులనీ, "ఫ్రెంచి ప్రజలు కళారంగానికి మాత్రమే విని యోగపడగలరని" నచ్చచెప్పడానికి తంటాలు పడతారు. ఇంకా ఇలాంటి వెన్నో తప్పుడుభావాలను ప్రచారం చేస్తారు.

## అమెరికాలో జాత్యహంకారానికి విరుద్ధంగా అభ్యుదయకాంక్షుకుల పోరాటం.

అమెరికాలో యీవిధంగా జాతి విద్వేషాలూ, జాతి సంఘర్షణలూ మితిమీరిపోవడాన్ని చూసి చాల మంది అమెరికన్లు తమ అదుర్దాను వెలిబుచ్చారు. ఇ. రోపర్ అనే ఒక పత్రికా సంపాదకుడు యిలారాశాడు; "మైనారిటీకి తగులుతున్న ప్రతిఒక్క దెబ్బ ప్రజాస్వామికానికీ, అమెరికాకు తగులుతున్న దెబ్బలుగా గుర్తించాలి." ఈవిధమైన జాతీయవాద పోకడలకు వ్యతిరేకంగా అమెరికా

లోని అభ్యుదయకరవర్గాలు పోరాడు తున్నాయి. అభ్యుదయభావాలుగల అధ్యాపకులు, స్కూళ్ళనుండి యీ ద్వేషపూరితమైన తత్వాన్ని తరిమి వేయడానికి తీవ్రప్రయత్నాలు చేస్తు న్నారు. ప్రగతిభావాలు గల పండి తులూ, కళాకారులూ విజ్ఞాన శాస్త్రిలలోనూ, కళారంగాలలోనూ ఒకజాతిని మరొకజాతి ద్వేషించే తత్వాన్ని ప్రోత్సహించే పోకడలను అరికట్టేందుకు తమశక్తినంతనూ విని యోగిస్తున్నారు. ఈ జాతీయవాదా నికీ, జాతీయ విద్వేషాలకు వ్యతిరే కంగా కొత్తగా స్థాపించబడిన అమె రికా మూడవ పార్టీ ఒక ఉద్య మాన్ని నడుపుతోంది. ఈ ఉద్య మంలోకి అభ్యుదయ భావాలవైపు మ్రొగ్గే అన్ని వర్గాలకు చెందిన ప్రజ లనేకమంది ఆకర్షించబడుతున్నారు. అన్నిరకాలకు చెందిన జాతివిద్వేష తత్వానికీ, బూర్జువా జాతీయవాదా నికీ — అది యేరూపంలో ప్రదర్శిత మైనప్పటికీ వ్యతిరేకంగా అమెరికా కమ్యూనిస్టులు దృఢనిశ్చయులై ఎడ తెగని పోరాటాన్ని సాగిస్తున్నారు

ప్రథమ ప్రపంచయుద్ధం ముగియు గానే సామ్రాజ్యవాదుల మధ్యవుండే తేడాలను యుద్ధం దాదాపు పూర్తిగా తగ్గించి వేసిందని లెనిన్ చెప్పాడు.

"ఉన్నవాటిల్లో ప్రజాస్వామిక వ్యవస్థ గల అమెరికానూ, అర్థమిలిటరీ నిరంకుశ రాజ్యమైన జర్మనీని, యుద్ధం ఒకేస్థితికి తెచ్చింది."

—కలెక్టడ్ వర్క్స్, సంపుటి 23 పుట 266

ఆనాడు వుండే అమెరికా ప్రజా తంత్ర వ్యవస్థను గురించి చెపుతూ లెనిన్ యింకా ఇలా అన్నాడు:

"అమెరికా ప్రజాతంత్రవ్యవస్థ సామ్రా జ్యవాదం అతిదుర్మార్గంగా ప్రవర్తించ కుండా ఆటంకపరచలేదు. అక్కడ శాంతిని అభిలషించే అంతర్జాతీయవాదు లను అవమానపరచడమేగాక, అక్కడ గుంపులువారిని బజారులలోకి యీడ్చు కొనివచ్చి, నిలబెట్టి వారిబట్టలను వూడ బెరికి, నగ్నస్వరూపులను చేస్తారు. వారిపై తారునుపోసి కాల్చివేసారు. శాంతికోసం మటుంచి కడకు పెసిఫిజాన్ని * కూడా ప్రచారం చేయరాదని నిర్బంధిస్తారు."

—అదేగ్రంథంలో 316 పుట

గత శతాబ్ద కాలంలో లెనిన్ బయటపెట్టిన యీ పరిణామంఇంకా చాల తీవ్రదశకు వెళ్ళింది. ఈనాడు అమెరికాలో పోలీసు, మిలిటరీ రాజ్యం వున్నదనే యదార్థాన్ని అం దరూ గుర్తించారు. శ్రామికవర్గ

*పెసిఫిజం: ఒకరకమైన శాంతివాదం. దుర్మార్గులూ కటిక ఫాసిస్టులయెడకూడా అహింసాతత్వాన్ని ప్రదర్శించాలనేవాదం. ఈ విధంగా యీవాదం పరోక్షంగా అన్ని రకాలైన అభివృద్ధినిరోధ తత్వానికి సాయపడుతుంది. దానిని నిరోధించరాదని చేతులు ముడుచుకోమని బోధిస్తుంది. మనదేశంలో గాంధీవాదం యిలాంటిదే. —(సం)

అంతర్జాతీయ వాదానికి సంబంధించిన భావాలను తీవ్రంగా ఎదుర్కొని పోరాడుటయే అమెరికా సామ్రాజ్య వాదులు అనుసరించే పాలసీ యొక్క ముఖ్యమైన ప్రత్యేక లక్షణం. అమెరికా ప్రజలలో వున్న అభ్యుదయ శక్తులు నన్నింటిని "అమెరికా వ్యతిరేక చర్యలను విచారించేకమీషన్" లాంటి తప్పుడు సంస్థ సహాయంతో ఎదుర్కొనడం, నేడు అమెరికా ప్రభుత్వం అనుసరించే పంథాలో ఒక ముఖ్యభాగం. ఈ కమీషన్ వెనక రాన్‌కిన్ లాంటి పచ్చి ఫాసిస్టూ, ప్రఖ్యాతజాతీయవాదీ వుండి, కార్యక్రమాన్ని నడుపుతున్నారు. కార్మిక వర్గ అంతర్జాతీయభావాలు, కష్టజీవులైన జనసామాన్యంలోకి చొచ్చుకొని పోయే కొద్దీ, కొత్తగా స్థాపించబడ్డ ప్రోగ్రెస్సీవు పార్టీ విజయాలనుఎక్కువగా సాధిస్తున్న కొద్దీ, ప్రజల నిజమైన జాతీయ ప్రయోజనాలను కాపాడే కమ్యూనిస్టుల అమరవాణి దేశంలో మార్మ్రోగిన కొద్దీ - అభివృద్ధి నిరోధక ముఠాలు సమాజంలో ముందడుగు వేసే ప్రతి ఒక్క శక్తినీ, అభ్యుదయ మన్న ప్రతి దానిని క్రూరంగా వేటాడుతారు. ఇంకా విపరీత స్వరూపంగల జాతీయ వాదాన్నిగురించి సామ్రాజ్యవాదులు అమితంగా ప్రచారం చేసి ప్రజల మనస్సులను విషపూరితం చేయడానికి యత్నిస్తారు.

## అభివృద్ధినిరోధక దోపిడీ ముఠాలకు అమెరికా ప్రపంచ నాయకత్వం

"అమెరికన్ నేషన్" అనే సిద్ధాంతం యేదో యాదృచ్ఛికంగా వచ్చిన సిద్ధాంతం కాదు. అది సామ్రాజ్య వాదుల శిబిరంలోని శక్తుల స్థితిగతులను ప్రతిబింబిస్తుంది.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 14వ కాంగ్రెసు జరిగిననాడే అంతర్జాతీయ పరిస్థితులను గురించి వివరించుతూ కామ్రేడ్ స్టాలిన్ యిలా వ్యాఖ్యానించారు:

> "ఈనాడు అందరికంటే ప్రపంచాన్ని అమితంగా దోపిడీచేసేదీ - ఉత్తర అమెరికా. దానికి కొంతవరకు సహాయగారిగా వుండి దోపిడీదారులలో ద్వితీయస్థానం ఆక్రమించుకొంటున్నది బ్రిటన్.
>
> "అంతమాత్రంచేత యూరప్ ఒక వలస దేశంయొక్క స్థితికి దిగజారిపోయిందని అర్థం చేసుకోరాదు. యూరప్ దేశాలు ఒకవైపున తమ ఆధిపత్యాన వున్న వలస దేశాలను దోపిడీ చేస్తూనే, మరోవైపున ఆర్థికంగా అమెరికాకు తామే లొంగి పోయారు. దీనిఫలితంగా యూరప్‌కూడా అమెరికాచే దోపిడీచేయబడు తున్నది. ఇంకా ముందుకూడా దోపిడీ చేయబడుతుంది."
>
> —కలెక్టెడ్ వర్క్సు, రష్యన్ ప్రచురణ 7వ సంపుటి 68-9 పుట.

1925 లోనే కామ్రేడ్ స్టాలిన్ చెప్పిన పరిణామం రెండో ప్రపంచ యుద్ధం తరువాత తీవ్ర రూపం దాల్చింది. అమెరికా గుత్తపెట్టుబడిదారులు పశ్చిమ యూరప్‌లో నున్న పెట్టుబడిదారీ దేశాలను "మార్షల్ ప్లాను" ద్వారా కొల్లగొట్టుకోవడం ప్రారంభించారు. ఈ దోపిడి విధానంలో ఫ్రెంచి పాలక వర్గాలూ, ఇంకా యితర పెట్టుబడిదారీ రాజ్యాల పాలకులూ, అమెరికా గుత్తవ్యాపారులకు నమ్మకమైన బంటు లయ్యారు. యూరప్‌లోని పెట్టుబడిదారీదేశాలు విదేశాంగ వ్యవహారాలలో వ్యక్తిత్వాన్ని, స్వతంత్రాన్ని కోలుపోయాయి. ఇక అంతరంగిక వ్యవహారాలలో అమెరికా సామ్రాజ్యవాదుల లాభాలకనుగుణ్యంగా ప్రవర్తించి తమ జాతీయప్రయోజనాలకు విరుద్ధంగా వారి గొంతెమ్మ కోర్కెలను తృప్తిపరుస్తున్నాయి ఈ విధంగా యూరప్‌లోని పెట్టుబడిదారీ దేశాలు తమ సర్వస్వాతంత్రాన్ని కోల్పోయాయి. యూరప్ దేశాల బూర్జువావర్గమూ, వారి గులాములైన మితవాద సోషలిస్టులూ, ఆదేశాల క్రిందనున్న వలసదేశాల ప్రజల గొంతుకలు నులిమే పాలసీని అనుసరిస్తున్నారు. తమ న్యాయమైన హక్కుల రక్షణకోసం, తమ జాతీయ విముక్తికోసం పోరాడుతున్న వియత్నాం ప్రజలను దారుణంగా అణచివేయుడానికి ఫ్రెంచిమితవాద సోషలిస్టులు సిగ్గువిడచి సిద్ధపడ్డారు. బ్రిటిష్ బూర్జువావర్గం, వారి ఏజెంట్లయిన మితవాద లేబరుపార్టీ సభ్యులూ, తమ క్రిందనున్న వలసదేశాల ప్రజల విషయంలో అదేవిధమైన పాలసీని అనుసరిస్తున్నారు. డచ్చి పెట్టుబడిదారులూ వారి తొత్తులైన మితవాద సోషలిస్టులూ, ఇండోనీషియాలోని జాతీయవిముక్తి ఉద్యమాన్ని అణచివేస్తున్నారు. మిత్రరాజ్యసమితి సమావేశాలల్లో ఆస్ట్రేలియా, న్యూజిలాండ్‌లాంటి దేశాల వోటింగ్ వైఖరినిబట్టి వారు ఎలాంటి "స్వాతంత్ర్యాన్ని" అనుభవిస్తున్నారో స్పష్టమవుతుంది. బూర్జువా ప్రభుత్వాలన్నింటియొక్క స్వదేశ, విదేశాంగ విధానాలన్నీ పరిశీలించితే, అవి అమెరికా సామ్రాజ్యవాదుల ఏజెంట్లని తేటతెల్లమవుతుంది.

వలసదేశాల ప్రజలను దారుణంగా అణచే కార్యక్రమాన్ని కొనసాగించుతూ, యీ బూర్జువా వర్గాలూ, బూటకపు సోషలిస్టులూ అతి నీచమైన తప్పుడుపనులకు కూడా సిద్ధపడుతున్నారు. ఇతర దేశాలపై

పెత్తనం చెలాయించడం మూలంగా వారి దేశాల "జాతీయ ప్రయోజనాల"కు లాభకరమనీ, జాతీయవాదమనే విషంతో ఆ దేశాలలోని కష్టజీవులైన ప్రజానీకాన్ని విషపూరితులను చేయడానికి ప్రయత్నించుతున్నారు. ఆవిధంగా వలసదేశాల ప్రజలను దోపిడిచేసి, బానిసత్వంలో ముంచే తమ పాలసీయెడల తమ ప్రజలు ఉపేక్షాభావాన్ని వహించేటట్లుగానూ, మరికొన్నిచోట్ల తమ కార్యక్రమంలో భాగస్తులుగా తయారయ్యేటట్లుగానూ, బూర్జువా వర్గం చేసుకొంటున్నది.

ఈవిధంగా బూర్జువా జాతీయవాదం ఆయా దేశాలలోని కష్టజీవులైన ప్రజలలో జాతీయవాదం అనే సిద్ధాంతంద్వారా చీలికలు తెచ్చి, విభజించి తన నీచ కార్యక్రమాన్ని కొనసాగిస్తోంది. తాను స్వదేశ, విదేశాంగ విధానాలలో అనుసరిస్తున్న అభివృద్ధినిరోధక పాలసీలోని అసహ్యాతను కప్పిపుచ్చుకొనేందుకూ, సమర్థించుకొనేందుకూ బూర్జువావర్గం ప్రజలలో జాతీయవాదాన్ని రెచ్చగొడుతుంది. ఉదాహరణకు ఫ్రాన్సు "యాక్షన్ ఫ్రాన్ఛైస్" అనే గ్రూపుకుచెందిన ఫాసిస్టు "సిద్ధాంతకర్తలు" (ఫ్రాన్సులో ఫాసిస్టు నియంతృత్వాన్ని స్థాపించవలసిన అవసరన్యాయసమ్మతాన్ని రుజువు చేసేందుకు "సంపూర్ణజాతీయవాదం" అనే సిద్ధాంతాన్ని వినియోగించారు.

## జాతీయవాదం యొక్క వర్గస్వభావం

బూర్జువా జాతీయవాదం - అది ప్రారంభమైనప్పుడే దాని యొక్క వర్గ స్వభావాన్ని మరుగు పరచుకోలేక పోయింది. 18 వ శతాబ్దంలో ఫ్రాన్సులో "జాతి" అన్న దానిని "ధనికులు" "విద్యావంతులు" గల వర్గాలవారే అని అర్థం చెప్పబడేది. 18 వ శతాబ్దానికి చెందిన ఒకజర్మన్ రచయిత ఆర్బెన్ గోలెజ్ యిలా రాశాడు: "జాతి అంటే నేను అర్థం చేసుకొన్నది ప్రజలలోని ఉన్నత వర్గాలవారే నని మాత్రమే. చేతి పనివారూ, రైతులు లాంటి క్రింది వర్గాలవారు మొత్తం మీద అన్ని చోట్లా అథమానవులు మాత్రమే." కాని ఆతరువాత బూర్జువాజీ తాను ప్రజలందరి తరపున, వారిప్రయోజనాలను వెల్లడిస్తున్నాననే నటనచేయడానికి ప్రయత్నించింది. అయినా వెనకటి పాతసాంప్రదాయాలు యీనాటికీ ప్రతిబింబిస్తూనే ఉన్నాయి. లియాన్ బ్లుమ్ (ఫ్రెంచి సోషలిస్టు నాయకుడు), అతని యజమానులూ

ఎలాంటి సంకోచం లేకుండా త్రోసి జాతి అనే దృక్పథాన్నుండి విప్లవ శ్రామికవర్గాన్ని మినహాయిస్తారు. ఈ సమస్య విషయంలో, యీనాటి సామ్రాజ్యవాద బూర్జువావర్గ రాజకీయ సిద్ధాంతాలు తమవర్గ ప్రయోజనాల పరిధిని దాటి బయటకు ఏమాత్రం వెళ్ళలేవు. "జాతి"యొక్క యీ దృక్పథాన్ననుసరించి, సుప్రసిద్ధ బూర్జువా సామాజిక శాస్త్రవేత్త బ్రైస్ ప్రజాతంత్రంపై రచించిన తన గ్రంథంలో ఇలా రాస్తాడు: బూర్జువా ప్రజాతంత్రంలో ప్రజల, జాతియొక్క కర్తవ్యాలు ప్రత్యేకంగా ఫలానివంటూ వుండవు. యితరులు చెపితే ఆచరించేవిగా మాత్రమే వుంటాయి. ప్రజలు ఎక్కువగా "తమకు సూచించిన విధానాన్ని తేలిగ్గా నిరాకరించగలరు. కాని తమంతట తాము అంత కంటే మంచి విధానాన్ని సూచించలేరు". ఆధునిక బూర్జువా రాజ్యం వెల్లడించే "జాతీయ అభీష్టాన్ని" గురించిన వివిధ సిద్ధాంతాల సారాంశమది. జాతి అన్నా, ప్రజలన్నా, తమ స్వంత దేశంలోని కష్టజీవులన్నా, బూర్జువాకున్న ద్వేషభావమే-బూర్జువా జాతీయ వాదానికున్న ప్రత్యేక విశిష్ట లక్షణం.

బూర్జువా జాతీయవాదం ప్రజాస్వామిక సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాశిబిరాన్ని బలపరచుకొని సంఘటితపరచుకొనడానికి జరిగే పోరాటానికి వ్యతిరేకంగా బూర్జువా వర్గం ఉపయోగించే ఒక విషపూరితమైన ఆయుధం. బూర్జువా జాతీయవాదాన్ని అనుసరించడమంటే, శ్రమజీవులైన జనసామాన్యంయొక్క జాతీయ ప్రయోజనాలకు ద్రోహంతలపెట్టడమన్న మాట.

కష్టజీవులైన ప్రజానీకాన్నీ, యింక యితర అభ్యుదయశక్తులనన్నింటినీ, బూర్జువా జాతీయవాదం కాలరాసి అణచివేస్తుందని ముఖ్యంగా జరిగిపోయిన యిటీవలి కొద్ది సంవత్సరాల అనుభవం మనకు తెలిపింది. టర్కీ, కోమింటాంగ్, చైనా, ఇరాన్ లాంటి దేశాలలో పెత్తనం వెలగబెట్టే అవకాశాన్ని తీసుకొన్న యీ బూర్జువా జాతీయవాదులు తమ దేశాలను ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులకు ఒక అనుబంధ వలసలుగా మార్చారన్న విషయం కూడా మనకు అనుభవమైంది. వారు తమ బూర్జువా పాలసీనీ ఎలాంటి "జాతీయ" నినాదాలతో మరుగుపరచారన్న విషయాన్నలా వుంచండి. వారు తమ దేశప్రయోజనాలకూ, ప్రజలకు ద్రోహం చేశారన్నదే ముఖ్యం.

బూర్జువా జాతీయవాదం ప్రజలను బానిసత్వంలోముంచే అభివృద్ధి నిరోధక పాత్రను నిర్వహించుతుందనే విషయం యీనాడువలె యింతకుముందెన్నడూ, యింతస్పష్టంగా బయటపడి వుండలేదు.

బూర్జువా జాతీయవాదం యీనాడు సామ్రాజ్యవాద అభివృద్ధి నిరోధకశక్తుల చేతులలో వున్న ఆయుధాలలోకెల్లా అత్యంత ప్రధానమైన ఆయుధం. తామనుసరించే స్వదేశ, విదేశాంగ విధానాలలో యిదిఒక అతిముఖ్యమైన సాధనం.

కాబట్టి, బూర్జువా జాతీయవాదానికి వ్యతిరేకంగా — అది ఏరూపంలో ప్రదర్శితమవుతున్నప్పటికీ — రాజీలేని ఎడతెగని పోరాటం జరపడం ప్రజాస్వామిక, సోషలిస్టు శక్తులందరియొక్క, ముఖ్యంగా కమ్యూనిస్టు పార్టీలయొక్క ప్రధాన బాధ్యత. కార్మికవర్గంలోనూ, శ్రమజీవులైన ప్రజలందరిలోనూ జాతీయ, జాత్యహంకారసిద్ధాంతప్రభావం ఏమాత్రం ఏకొద్దిగానైనా చొరనివ్వకుండా జాగ్రత్తపడటం, కార్మికులకూ, యితర శ్రమజీవులైన జనసామాన్యానికీ, శ్రామికవర్గ అంతర్జాతీయవాద తత్వంలో అదేపనిగా శిక్షణను ఇవ్వడం, వివిధజాతులమధ్య స్నేహభావాన్ని ప్రబోధించే సిద్ధాంతంలో ప్రజలకు పూర్తినమ్మకాన్ని కలిగించడం—యీ బాధ్యతలనన్నింటినీ నిర్వహించడమంటే సామ్రాజ్యవాద అభివృద్ధినిరోధక దుష్టశక్తుల కూటమికి వ్యతిరేకంగా ఒక అజేయమైన ఆయుధాన్ని చేజిక్కించుకోవడమన్నమాట.

లెనిన్ మహాశయుడు మనకీవిధంగా ప్రబోధిస్తున్నాడు :

"శ్రామికవర్గానికి సేవచేయగోరే వారంతా "తనలోనూ", యితరులలోనూ వుండే బూర్జువా జాతీయతతో దృఢతరంగా పోరాడటంద్వారా, అన్నిదేశాల లోని కార్మికులను ఐక్యంచేసి తీరవలసి వుంది."

— కలెక్టెడ్ వర్క్సు, రష్యన్ ప్రచురణ 17 వ సంపుటి 138 పుట

ఇంకా :

"అన్నిదేశాలలోవుండే శ్రామికులతో సంపూర్ణ ఐక్యతను కలిగివుండటంకంటే, "తన" జాతియొక్క బూర్జువావర్గంతో రాజకీయ ఐక్యతనే ప్రధానమని యెంచుకొనే ప్రతికార్మికుడూ తన ప్రయోజనాలకు విరుద్ధంగానూ, సోషలిజం, ప్రజాస్వామికాలయొక్క ప్రయోజనాలకూ విరుద్ధంగా పనిజేస్తాడు."

— కలెక్టెడ్ వర్క్సు, రష్యన్ ప్రచురణ 16 వ సంపుటి 509 పుట.

## శ్రామికవర్గ అంతర్జాతీయవాద ఆవశ్యకత

శ్రామికవర్గ అంతర్జాతీయవాదం యెడల భక్తివిశ్వాసాలుగల కమ్యూనిస్టుపార్టీలు, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రజల స్వాతంత్ర్యంకోసం, శాంతికోసం, ప్రజాస్వామిక ప్రజాతంత్రంకోసం, సోషలిజంకోసం ప్రపంచమంతటా శ్రామికప్రజలు జరిపే పోరాట సంయుక్త సంఘటలను బలపరుస్తాయి. యుగోస్లోవియా కమ్యూనిస్టు పార్టీ అగ్రనాయకుల (టిటో, కార్డెల్జ, దిజలాస్, రాన్కో

విచ్) ప్రవర్తనను అన్ని దేశాలలోని కమ్యూనిస్టుపార్టీలు ఏకకంఠంతో తీవ్రంగానూ, దృఢంగాను, ఎందుకు ఖండించారో మనం అర్థంచేసుకోవచ్చు. యుగోస్లావియా కమ్యూనిస్టు పార్టీ నాయకులు సోషలిస్టు సంయుక్త సంఘటనను భగ్నపరచి సోషలిజానికీ, శ్రామిక ప్రజల అంతర్జాతీయ ఐక్య సంఘటన ఆశయానికీ ద్రోహంచేసి, జాతీయవాదానికి దిగజారారు. యుగోస్లావియా కమ్యూనిస్టు పార్టీలోని పరిస్థితులనుగురించి 1948 జూన్‌లో జరిగిన కమ్యూనిస్టుపార్టీల సమాచారశాఖ సమావేశంలో చేయబడిన తీర్మానం యీ క్రిందివిధంగా నొక్కి చెప్పింది:

> సోవియట్ యూనియన్ సహాయం లేకుండా, యితర దేశాల కమ్యూనిస్టు పార్టీల సహాయం లేకుండా, ప్రజాస్వామిక ప్రజాతంత్రరాజ్యాల సహాయంలేకుండా యుగోస్లావియా తన స్వాతంత్ర్యాన్నినిలబెట్టుకొని, తనదేశంలో సోషలిజాన్ని నిర్మించడం సాధ్యంకాదు. అంతేకాదు; యుగోస్లావియా నాయకులు అవలంబిస్తున్న జాతీయ ధోరణి, యుగోస్లావియా మామూలుగా బూర్జువా రిపబ్లిక్ స్థితికి దిగజారడానికి మాత్రమే దారితీస్తుంది. ఇందు మూలంగా యుగోస్లావియా తన స్వాతంత్ర్యాన్ని కోల్పోయి, సామ్రాజ్యవాద దేశాలకు వలస రాజ్యంగా మారిపోయే ప్రమాదం ఉంది."

సోదరకమ్యూనిస్టు పార్టీలనాయకత్వాన ప్రపంచ మంతటా వున్న శ్రామిక వర్గం మరొకనూతన యుద్ధానికి, మానవజాతిని గురిచేసేందుకు ప్రయత్నించుతున్న సామ్రాజ్యవాద కూటమికి వ్యతిరేకంగా పోరాటాన్ని సాగించే ప్రజాస్వామిక శిబిరానికి నాయకత్వం వహించే, అగ్రగామిగా సోవియట్ యూనియన్‌ను సహజంగా గుర్తిస్తుంది. యుద్ధ ప్రేరేపకులకు వ్యతిరేకంగా శాంతికోరకు ఎడతెగని పోరాటాన్ని సాగించే బలవత్తరమైన సోవియట్ యూనియన్ ప్రజాస్వామిక, సోషలిస్టు శక్తులకు బలమైన అండ.

నూతన ప్రజాతంత్ర దేశాలలోని ప్రజానీకానికిముందుండి నడుపుతున్న సోదర కమ్యూనిస్టు పార్టీలు సోవియట్ సైన్యం మూలంగానే తమ దేశాలు జర్మన్ ఫాసిస్టుబానిసత్వాన్ని వదిలించుకోగలిగి స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలను సాధించుకో గలిగామని అర్థం చేసుకొన్నాయి. ప్రజాస్వామిక ప్రజాతంత్ర వ్యవస్థను స్థాపించుకొని,

విముక్తి పొందిన దేశాలలోని ప్రజాతంత్రశక్తుల స్వేచ్ఛాభివృద్ధిని సోవియట్ యూనియన్ గ్యారంటీ చేస్తుందని, అవి పూర్తిగా గుర్తించాయి. సోవియట్ యూనియన్ సహాయం లేకుండా, నూతన ప్రజాతంత్ర రాజ్యాల సహాయంలేకుండా, మొత్తం అంతర్జాతీయ సోషలిస్టు సంఘటన లేకుండా తాము సోషలిజాన్ని నిర్మించలేమని సోదర కమ్యూనిస్టుపార్టీలు గుర్తించాయి.

పైన ఉదహరించిన కమ్యూనిస్టుపార్టీల సమాచారశాఖ సమావేశంలో సోదర కమ్యూనిస్టుపార్టీల ప్రతినిధులు యితరదేశాల స్వేచ్ఛాస్వాతంత్ర్యాల కోసం జరిగే పోరాటంలో సోవియట్ యూనియన్ పాత్రనూ, ప్రాముఖ్యతనూ ముఖ్యంగా నొక్కిచెప్పారు. జెకోస్లోవేకియా కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధి కామ్రేడ్ శ్లాన్‌స్కీ యిలాఅన్నాడు:

"మా ప్రజలు స్టాలిన్ ఆధ్వర్యాన సోవియట్ యూనియన్ అనుసరించే విదేశాంగ విధానంయొక్క గొప్పప్రాముఖ్యత శాంతికోసం, భద్రతకోసం, అందరిప్రజల సమానహక్కులకోసం పోరాడే స్టాలినిస్టు విదేశాంగవిధానం — యుద్ధప్రేరేపకులకు సరియైన చెంపపెట్టుపెట్టే సోవియట్ యూనియన్ స్టాలినిస్టు విదేశాంగనీతి — తమ భావికి ఎంతటి ప్రాముఖ్యం ఉందో అర్థం చేసుకొన్నారు."

ఫాసిస్టు బానిసత్వాన్నుండి సోవియట్ విజయసైన్యంచే విముక్తిచేయబడి, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు పురోగమిస్తున్న నూతన ప్రజాతంత్ర దేశాల ప్రజలు — రుమేనియా విదేశాంగమంత్రి కామ్రేడ్ అన్నాపాకర్ అన్నట్లు సామ్రాజ్యవాద ప్రభుత్వాల దయాదాక్షిణ్యాలకు నేడు తాము త్రోయబడి, ఏకాకులుగా లేమని స్పష్టంగా తెలుసుకొన్నారు. వారి హక్కులను సోవియట్ యూనియన్ కాపాడుతోంది.

అన్నిదేశాలలో వున్న శ్రామిక ప్రజలు తమ ముఖ్యప్రయోజనాలూ తమ జాతీయభవితవ్యాలూ, ప్రజాస్వామిక, సోషలిజం భవిష్యత్తుతోనూ, సోవియట్ యూనియన్ నాయకత్వాన ప్రజాస్వామిక సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాశిబిరం సాధించే విజయాలతోనూ, ముడివడి వున్నాయని తమ స్వంత అనుభవంద్వారానే రోజురోజుకూ విశ్వసిస్తున్నారు.

—"బోల్షివిక్" పత్రిక 15 వ
సంచికనుండి 15-8-1948

(రష్యా భాషనుండి కామ్రేడ్ ఎ. బి. కార్డిశర్ చేసిన ఇంగ్లీషు తర్జుమాకు ఇది తెలుగు అనువాదం).



# వార్తలూ - విశేషాలు

## సోవియట్ యూనియన్‌పై జరిగే దురాక్రమణ యుద్ధంయెడల బ్రిటిష్ కార్మికుల వైఖరి

### కామ్రేడ్ హారీపాలిట్ స్పష్టీకరణ

[బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శి కామ్రేడ్ హారీపాలిట్ యిటీవల ఒక ముఖ్యప్రకటన చేశాడు. దానిని బూర్జువాపత్రికలు తమ కిష్టమొచ్చిన రీతిని ప్రకటించాయి. అందువలన ఆయన అధికారరీత్యా చేసిన ప్రకటన పూర్తిపాఠాన్ని ప్రచురిస్తున్నాం —సంపాదకవర్గం]

కామ్రేడ్ హారీపాలిట్ యీ క్రింది విధంగా వ్రాస్తున్నాడు:

1948 అక్టోబరు 3 వ తేదీన షెఫీల్డులోని సిటీహాల్ లో ప్రసంగిస్తూ నేను యీవిధంగా అన్నాను:

"సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా, అమెరికా వారు దురాక్రమణ యుద్ధాన్ని ప్రారంభించినట్లయితే బ్రిటిష్ కార్మికవర్గం బ్రిటిష్ ప్రజలను తమకర్తవ్యాన్ని నిర్వహించమని చెపుతారు.

"సోవియట్ యూనియన్ లోని తమ సోషలిస్టు కామ్రేడ్సుకు వ్యతిరేకంగా బ్రిటిష్ కార్మికులు పనిచేయరు, పోరాడరు. ఈ విషయంలో నాకు విశ్వాసం ఉంది.

"ఆ విధమైన యుద్ధం ప్రారంభమైన పక్షంలో మేమనుసరించే పంథాను గురించి నన్నడిగినట్లయితే, నేను యిలా అంటాను: ఈనాడు విదేశాంగ వ్యవహారాల మంత్రిగావున్న ఎరనిస్టు బెవిన్ 1920లో ఏమిచేశాడో సరిగ్గా అదే యీనాడు చేయమని కోరతాను. 1920 లో రష్యాకు వ్యతిరేకంగా జరిగిన యుద్ధాన్ని ఆపడానికి 'జాలీజార్జి' లో సమ్మె జేయడానికి సహాయపడ్డాడు; యుద్ధం జరుగకుండా ప్రయత్నించడానికి ఏర్పడ్డ కార్యాచరణ కమిటీలను బలపరచడానికి సిద్ధపడ్డాడు."

ఇదే ప్రకటనను ఆ నాటినుండి 1948 నవంబరు ఆఖరు వరకూ, నేను ప్రసంగించిన

ప్రతి ఒక్క బహిరంగసభలో, మాదిరికి పేర్కొన్నాను.

వార్సాలో జరిగిన పోలండ్ యునైటెడ్ వర్కర్సు పార్టీ (కమ్యూనిస్టుపార్టీ - సం) కాంగ్రెసులో 1948 డిసెంబరు 16 వ తేదీన ప్రసంగిస్తూ యిలా చెప్పాను:

"సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా బ్రిటిష్ గని పనివారూ, ఇంజనీర్లూ, నావలను నిర్మించే కార్మికులూ, ఓడపనివాండ్రూ, బ్రిటిష్ ఉక్కు కార్మికులూ, రవాణా కార్మికులూ - ఒక్క మాటలో బ్రిటిష్ కార్మికులెవ్వరూ పోరాడరు - ఎన్నటికీ పోరాడరు. ఈ విషయాన్ని మీపార్టీ కాంగ్రెసుముందు నమ్మకంగా చెప్పగలను."

1948 డిసెంబరు 20వ తేదీన సోఫియాలో జరిగిన బల్గేరియన్ వర్కర్సుపార్టీ (కమ్యూనిస్టు పార్టీ) కాంగ్రెసులో మాట్లాడుతూ అదే ప్రకటనను పునరుద్ఘాటించాను.

1949 ఫిబ్రవరి 27 వ తేదీ ఆదివారం జరిగిన బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ విస్తృత కార్యవర్గ సమావేశంలో నేను యిలా చెప్పాను:

"సోవియట్ యూనియన్ పై థోరెజ్, టొగ్లియాటీలు చేసిన ప్రకటనలనుగురించి నా అభిప్రాయమిది: ఈ యిద్దరు కామ్రేడ్సూ తమదేశాలలో పదేసి లక్షలకుపైగా సభ్యత్వాన్ని కలిగిన పార్టీలకు అధినేతలు. ఆ దేశాలలోని ట్రేడ్‌యూనియన్ ఉద్యమాలకు నాయకులు. పార్లమెంటులలో పెద్దపార్టీలు కలిగినవారు. ఉత్తర అట్లాంటిక్ ఒడంబడికను గురించి వాషింగ్‌టన్‌లో అతి ముఖ్యమైన సంప్రతింపులు యింకా జరుగుతూనే ఉన్నాయి. ఉత్తర అట్లాంటిక్ ఒడంబడికలో తమదేశాలుకూడా యిరికించబడితే వుండే ప్రమాదాన్ని గురించి ప్రజలలోవున్న ఆందోళనను థోరెజ్, టొగ్లియాటీలు చేసిన ప్రకటనలు మరింత ఎక్కువ చేస్తాయని నమ్ముతున్నా.

"సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా సామ్రాజ్యవాదుల కీలుబొమ్మలుగా తమదేశాలు ఉపయోగపడటం, ఆ దేశాలలో అత్యధిక మెజారిటీ సంఖ్యగల ప్రజల తరఫున వారి అభిప్రాయాలను థోరెజ్, టొగ్లియాటీలు వ్యక్తం చేసినట్లు నాకు కనబడుతున్నది.

"సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా సామ్రాజ్యవాద దురాక్రమణ యుద్ధం వచ్చినపక్షంలో - అలాంటి యుద్ధంకాక మరొకరకమైన యుద్ధంవచ్చే అవకాశమే లేదుకనుక - మీరేమి చేస్తారని రెచ్చగొట్టే పెద్దమనుష్యులు నన్ను అడిగితే, 1920లో ఎర్నెస్టు బెవిన్, లేబరు పార్టీ చెప్పిన పద్ధతిలోనే అని మేము సమాధానం చెప్తాం. ఆనాడు వారు చెప్పిన దేమిటి? యుద్ధాన్ని ఆపడానికి సమ్మెలను చేయించడం, కార్యాచరణ కమిటీలను ఏర్పరచడం.

"బ్రిటన్‌లో మనం ముఖ్యంగా జ్ఞాపకం పెట్టుకోవలసిన విషయమేమనగా మనం యీపాటికే అమెరికావారి ఆక్రమణలో వున్నాం. అందువలన యిప్పటి నుండీ అమెరికా సాయుధ బలాలనూ, విమాన ఆశ్రయాలనూ బ్రిటన్‌నుండి ఉపసంహరించుకోవాలని డిమాండ్ చేస్తూ వుంటాం."

ఈ ప్రకటననే మార్చి 2 న హార్న్‌సేలోనూ, మార్చి 3న బెడ్‌ఫోర్డులోనూ తిరిగి ఉద్ఘాటించాను. ఇకముందు కూడా యిదే

విషయాన్ని మళ్ళీ మళ్ళీ చెప్పదలచుకొన్నాను. ఎందువల్లనగా ఆంగ్లో - అమెరికన్ కూటమినుండి, దానియొక్క యుద్ధపాలసీనుండి యీ నాడు ముఖ్యంగా యుద్ధప్రమాదం వుందని నేను నమ్ముతున్నాను. కాని యుద్ధంరాక పోవచ్చు. ఎందుకంటె యుద్ధోన్మాదులకంటె శాంతి కాముకులే బలంగా వున్నారు. అయితే; యుద్ధం తప్పనిసరిగావచ్చే పక్షంలో అమెరికన్ సామ్రాజ్యవాదులు బ్రిటన్‌ను, ఒక ప్రధాన యుద్ధకేంద్రంగా వినియోగించదలుస్తున్నారు. దీనిఫలితం అమెరికనుల పని డాలర్లూ, మందుగుండు సామానూ సరఫరా చేయడమైతే - చావడం, యుద్ధంలో పోరాడటం బ్రిటిష్ యువకుల వంతు.

ఇలాంటి ఉద్దేశ్యాలను ఓడించి తీరాలి. సోవియట్ యూనియన్ వల్లవచ్చే యుద్ధమంటూ ఎన్నడూవుండదు. కాని సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగానే యుద్ధం వచ్చే పక్షంలో, తక్కిన ప్రపంచంలోవున్న కార్మికులందరూ సామ్రాజ్యవాదుల దాడులనన్నింటినీ ఎదుర్కొని సోవియట్ యూనియన్ రక్షించుకొని తీరుతారు.

— హారీపాలిట్

— "వరల్డు న్యూస్ అండ్ వ్యూస్"
(1949 మార్చి 19)

"విప్లవం దానంతట అదే జయంపొందదు. దానికొరకై సర్వసన్నాహాలూ చేసుకొని, పోరాడి జయించాలి. బలీయమైన శ్రామికవర్గపార్టీయే అట్టి విప్లవానికి సర్వసన్నాహాలము చేసి, పోరాటంజరిపి, జయించగలదు."

— స్టాలిన్

# సోషలిస్టు ప్రపంచం : పత్రికలు
# పెట్టుబడిదారీ ప్రపంచం

— నికోలై సమర్స్కీ

సోవియట్ యూనియన్‌లో దాదాపు 7133 వార్తాపత్రికలు 81 భాషలలో ప్రచురించబడుతున్నాయి. మొత్తంమీద 3 కోట్ల 32 లక్షల పత్రికల కాపీలు ప్రకటించబడతాయి. వార్తాపత్రికలు ముఖ్యపట్టణాలనుండీ, పెద్ద పారిశ్రామిక కేంద్రాలనుండీ, ఎక్కడో మారుమూలలనున్న ప్రదేశాలనుండి వెలువడుతున్నాయి.

సోవియట్ యూనియన్‌లో వ్యక్తిగత ప్రచురణకర్తలుగానీ, వార్తాపత్రికల యజమానులుకాని ఉండనేవుండరు. అన్ని పత్రికలూ, కార్మికులూ, కర్షకులూ, మేధావులూ మొదలుగాగలవారి పత్రికలుగానే వెలువడుతూనే వుంటాయి. సోవియట్స్ ఆఫ్ వర్కింగ్ పీపుల్స్ డిప్యూటీలు, కమ్యూనిస్టు పార్టీ సంస్థలూ, ట్రేడ్ యూనియన్లూ, సహకార సంస్థలూ, మహిళా సంఘాలూ, యువజన సంఘాలూ యింకా యితర ప్రజాసంస్థలూ, తమ తమతరఫున పత్రికలను ప్రచురిస్తాయి. అంతేకాక పట్టణాలూ, పల్లెలూ, ఫ్యాక్టరీలూ, మిల్లులూ, ఉన్నత విద్యాలయాలూ, పరిశోధక సంస్థలూ (రిసర్చి) కూడా పత్రికలను ప్రకటిస్తాయి.

రష్యాలో సోవియట్ ప్రభుత్వం ఏర్పడకముందు పత్రికలన్నీ భూస్వాముల చేతులలోనూ, బూర్జువావర్గ ఆధీనంలోనూ ఉండేవి. అవన్నీ శ్రామిక ప్రజానీకాన్ని అణచివేసే విధానాన్ని బలపరచుతూ వుండేవి. అప్పుడు859 వార్తాపత్రికలు మాత్రమే ప్రచురించబడేవి. మొత్తం అమ్ముడుపోయే కాపీలసంఖ్య 20 లక్షల 70 వేలు మాత్రమే.

1917 అక్టోబరులో రాజకీయాధికారం— ఉత్పత్తిసాధనాలు — కార్మిక కర్షకుల స్వాధీనమైన తరువాత,

వాక్స్వాతంత్ర్యం, పత్రికా స్వాతంత్ర్యంతోసహా అన్ని పౌరస్వాతంత్ర్య హక్కులనూ ప్రజలు అనుభవించడం ప్రారంభించారు. కాగితంపై పత్రికాస్వాతంత్ర్యం అంటూ ప్రకటించి, ఆచరణలో నిరాకరించే బూర్జువా విధానానికి సోవియట్ వ్యవస్థ స్వస్తి చెప్పింది.

సోవియట్ పత్రికలు ప్రజలు గడించుకొన్న రాజకీయస్వాతంత్ర్యానికి ప్రతిబింబాలు. ఈ సందర్భంలో మైకేల్ కాలినిన్ యిలా అన్నాడు :

"సోవియట్ పత్రికలు ప్రజలకు కమ్యూనిస్టు విద్యను ప్రసాదించే ఆశయాన్ని నెరవేరుస్తాయి. జమీందార్లు, పెట్టుబడిదార్లూ లేకుండా తమ ఆర్థికవిధానాన్ని ఏవిధంగా అభివృద్ధి పరచుకోవాలో, ఏవిధమైన జీవిత విధానాన్ని అలవరచుకోవాలో ప్రజలకు నేర్పుతాయి. సోవియట్ పత్రికలు యావత్తు ప్రజానీకానికి సేవచేస్తాయి. సోవియట్ ప్రజలు తమ బోల్షివిక్ పత్రికలయెడల ప్రదర్శించే అత్యంత ఆదరాభిమానాల కారణ మిదే."

## సోవియట్ పత్రికల ప్రత్యేక విశిష్ఠత

ఇతర దేశాలలోని పత్రికలలో చాల భాగం సంపాదక వర్గంలోవుండే రచయితలతోనే వ్రాయబడుతుంది. కాని సోవియట్ యూనియన్‌లోని పత్రికల విషయం దానికి పూర్తిగా విరుద్ధం. ఆ పత్రికలలోని విషయాలను, వ్యాసాలను సంపాదక వర్గంలోని సభ్యులుగాక యితర రచయితల చేతనే ఎక్కువ వ్రాయబడతాయి. పత్రికలలో వ్రాసే విలేఖరులు ఫ్యాక్టరీలలోనూ, మిల్లులలోనూ, సమిష్టి వ్యవసాయక్షేత్రాలలోనూ మామూలుగా తమ పనిపాట్లలను చేసుకొనే వారే అయివుంటారు. ఇతర ఆఫీసులలోనూ, విజ్ఞాన శాస్త్రసంస్థలలో పని చేసే వారు కూడా విలేఖరులుగా వుంటారు. ఉదాహరణకు,యూక్రైన్ రిపబ్లిక్‌లోని 'విన్నిట్సె' అనే ప్రాంతీయ కేంద్రంలో ప్రచురింప బడే వార్తాపత్రికకు 1347 గురు స్వయం విలేఖరులున్నారు. వారు ఒక్క సంవత్సర కాలంలో ఆపత్రికకు 12,500 సమస్యలపైన వ్యాసాలనూ, విషయాలను వ్రాసి పంపించారు.

మాస్కో "కొడవలీ – సుత్తీ" ఉక్కుమిల్లుకు సంబంధించిన "మార్టనోవెట్సు" అనే ఫ్యాక్టరీ వార్తాపత్రికకు ఆమిల్లులో పనిచేసే కార్మికులూ ఇంజనీర్లు, టెక్నికల్ ఉద్యోగులు, యితర ఆఫీసు ఉద్యోగుల నుండే 4,500 మంది విలేఖరులున్నారు. వీరు అప్పుడప్పుడుగాక రెగ్యులర్‌గా పత్రికకు వ్రాస్తూవుండే విలేఖరులు. సోవియట్ వార్తా పత్రికలను మొత్తం మీద లెక్కతీసుకుంటే గత సంపత్స

రం పత్రికా కార్యాలయాలలోని వాసుగాక బయటనుండి యార్టికిల్ విలేఖరులుగా పనిచేసిన వారి సంఖ్య 20 లక్షలు అని తేలింది. ఇదొక మహత్తరమైన విషయం. ఈ విషయాన్నిగురించి మాట్లాడుతూ స్టాలిన్ ఇలా అన్నాడు.

"వార్తాపత్రికలను నడిపేవిషయంలో యీ విధంగా కార్మికులు పాల్గొనడం లోని ప్రాముఖ్యతఏమంటే — వార్తాపత్రికలాంటి నిశితమైన ఆయుధాన్ని వర్గ పోరాటంలో ప్రజలను అణచివేయ డానికిగాక, వారిని విముక్తిచేసే సాధనంగా మార్చి వినియోగించే అవకాశం లభించడమే. పత్రికలలో యిలాంటి మహత్తరమైనమార్పు కార్మికకర్షక వర్గాల నుండి వచ్చిన విలేఖరులవల్లనే సాధ్యపడుతుంది."

పత్రికల ఆఫీసులో పనిచేయకుండా తమంతట తాముగా వ్రాసే యీ విలేఖరులు ప్రజాభిప్రాయాన్ని తెలుపగలుగుతారు. లోట్లను బయట పెట్టుతారు. సోషలిస్టు విధానాన్ని మరింతగా అభివృద్ధిచేసి, సంఘటితపరచడానికి పోరాడుతారు.

## గోడ వార్తాపత్రికల ప్రచురణ

ఈ పత్రికలుగాక వేలకొలది - గోడ వార్తాపత్రికలు వడుపబడతాయి. ఈ పత్రికలను నడిపే కార్యక్రమంలో లక్షలాది ప్రజలు చురుకుగా పాల్గొంటారు. ఫ్యాక్టరీలలోనూ, మిల్లులలోనూ కార్మికులు యీ పత్రికలను ప్రచురించుతారు. అలాగే పల్లెప్రాంతాలకు సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోనూ ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలోనూ, గోడవార్తాపత్రికలు ప్రకటించ బడతాయి. స్కూళ్ళలోనూ, ఆఫీసులలోనూ, విజ్ఞానశాస్త్ర సంస్థలలోనూ అన్నిచోట్లా గోడ వార్తా పత్రికలను నడుపుతారు.

తమ వార్తాపత్రికలకు తమ దైనందిన జీవితాన్నిగురించి, తమపనినిగురించి. తమ ప్రయోజనాలనుగురించి, వ్రాను కొనే పూర్తి అవకాశం కార్మికులకు వుండాలన్న లెనిన్ ఆదేశం, సోవియట్‌లో పూర్తిగా ఆచరణలో పెట్టబడుతోంది.

సోవియట్ వార్తా పత్రికల సైజు విషయంలోనూ, వ్యాప్తి విషయంలోనూ, పాఠకుల విషయంలోనూ ఎన్ని తేడాలున్నప్పటికీ పత్రికలన్నింటికీ ఒక ప్రధాన ఆశయం మాత్రం ఉంది. అదేమంటే, పత్రికలన్నీ సోవియట్ యూనియన్‌లోని సోషలిస్టు వ్యవస్థను యింకా అభివృద్ధిపరచి, సంఘటితపరచడానికి సోవియట్ ప్రజలను ఉద్రిక్తపరుస్తాయి; ఉత్సాహపరుస్తాయి. సోవియట్ పత్రికలు ప్రతిరోజూ పారిశ్రామికంగా, టెక్నికల్‌గా, శాస్త్రీయంగా సోషలిస్టు సమాజనిర్మాతలు గడించిన అనుభవాన్ని వ్యాపింపజేస్తాయి.

పంచవర్ష ప్రణాళికను నాలుగేండ్లలో పూర్తిచేయడానికి ప్రజలను ఉత్సాహ పరచి, సమీకరించుతాయి. ప్రజా నీకంలో సాంకేతిక, శాస్త్రీయ విజ్ఞానాన్ని వెదజల్లుతాయి. ప్రపంచశాంతి కోసం పనిచేస్తాయి. శాంతిని అభిల షించే సోవియట్ యూనియన్ పాల సీని ప్రజలకు వివరించి, యుద్ధాన్ని ప్రేరేపించుతున్న ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదుల, వారి మితవాద సోషలిస్టు ఏజెంట్ల కుతంత్రాలను బట్ట బయలుచేస్తాయి. శాంతికోసం, వివిధ దేశాల, జాతుల భద్రత కోసం పోరాడుతాయి. ఈకృషిలోనే సోవి యట్ పత్రికలు ప్రదర్శించే మహత్తర మానవత్వం యిమిడివుంది. సోవియట్ ప్రజలవలె సోవియట్ పత్రికలుకూడా జాత్యహంకారాన్ని, జాతివిద్వేషాలనూ, యితర నిర్బంధాలనూ అసహ్యించుకొంటాయి.

## పెట్టుబడిదారీ ప్రపంచంలోని పత్రికల నిజస్వరూపం

అయితే పత్రికా స్వాతంత్ర్యం అన్నిదేశాలలోనూ లేదు. ఉదాహరణకు బ్రిటన్‌ను తీసుకుంటే-ఆదేశంలో కొన్ని కార్మికవర్గ పత్రికలూ, మరికొన్ని అభ్యుదయ పత్రికలు తప్పిస్తే, తతిమ్మాపత్రికలన్నీ ఆరుపెద్దగుత్తవ్యాపార కంపెనీల స్వాధీనంలోవున్నాయి. ఇవిమాత్రమే "పత్రికా స్వాతంత్ర్యాన్ని" అనుభవిస్తున్నాయి. ఈ ఆరుకంపెనీల స్వాధీనంలో వున్నపత్రికల మొత్తం అమ్మకం 3 కోట్ల కాపీలకు పైగా ఉంటుంది.

బెర్రీబదర్సు (లార్డుకామ్‌రోస్, లార్డు కెమ్‌స్లీ), రూథర్‌మిర్, బీవర్ బ్రూక్, హేరిసన్, మొర్రైల్ (వెస్టు మినిస్టర్ ప్రెస్ ప్రొవిన్షియల్‌న్యూస్ పేపర్లుఇతనిస్వాధీనంలోనే ఉంటాయి.) ఈ ఆరుగురూ బ్రిటిషు పత్రికా ప్రపంచానికి మకుటంలేని రాజులు. ఈ బడాపెట్టుబడి దారులు "ప్రజాభిప్రాయాన్ని" గుత్త పెట్టుబడిదారుల ప్రయోజనాలకు అనుకూలంగా తయారు చేస్తారు. ఒకసారి లార్డు కెమ్‌స్లీ, కెనడియన్ సంపాదకులవద్ద మాట్లాడుతూ, తన స్వాధీనంలోవున్న వార్తాపత్రిక లన్నిటి సంపాదకీయ పాలసీని తన కార్యాలయంలో కూర్చొని నడిపిస్తానని బడాయి చెప్పు కొన్నాడు. తాను బ్రిటిష్ ఫాసిస్టు ముఠానాయకుడైన మోస్లీ అనుచరుడనని లార్డు రూథర్‌మీర్ బహిరంగంగానే వొప్పుకొన్నాడు. అయితే యీ పత్రికా చక్రవర్తుల యాజమాన్యాన నడిచే పత్రికలు ప్రజలకు విరుద్ధంగా ఉంటాయనే విషయంవేరే

చెప్పనవసరంలేదు. ఆపత్రికలుప్రజల యొక్క అభిప్రాయాలను, ఆశయాలను వెల్లడిచేయవు; వెల్లడిచేయలేవు.

బ్రిటిషు పత్రికలు చిన్నముఠా స్వాధీనంలోవుండి, వారి సంకుచిత, స్వార్థ ప్రయోజనాలకోసం ఉపయోగపడతాయని బ్రిటిషు ప్రజలలో సాంఘికంగా వివిధ తరగతులకు చెందినవారి ప్రతినిధులే సామాన్యంగా అంటూవుంటారు. లార్డు బీవర్‌బ్రూక్ అధీనంలోవుండే వార్తాపత్రికలు మామూలు అర్థంలో వాడుకొనే పత్రికలు అసలు కానేకావని మాజీప్రధాని బాల్డ్విన్‌సహితం ఒకసారి అన్నాడు. ఈపత్రికలు అనుసరించే పద్ధతులేమిటి? అబద్ధాలు ప్రచారంచేయడం, యదార్థాన్ని మరుగుపరచి తప్పుడుగా చిత్రించడం. ఈ వార్తాపత్రికల యజమానులు బాధ్యతలేకుండా అధికారం కావాలని కోరతాడు. ఇది పరిమితిలేని దుర్వ్యసనం తప్ప మరొకటికాదు.

....డాలర్ రాజ్యంలో....

అమెరికాలోని పత్రికల పరిస్థితి కూడా దాదాపు యింతే. అక్కడ కూడా పత్రికా ప్రపంచంపై సర్వాధికారం గుత్తపెట్టుబడిదారులదే. అమెరికాలోని "అసోషియేషన్ ఆఫ్ న్యూస్ పేపర్సు పబ్లిషర్సు" 1500 పత్రికా యజమానులను ఐక్యం చేస్తుంది. అమెరికాలో వ్యాప్తిలో వున్న పత్రికల మొత్తం అమ్మకంలో నూటికి 98 వంతులు వీరి స్వాధీనంలోనే ఉన్నాయి. తిరిగి ఈ 1500 పత్రికా యజమానులలో సహితం ఒక చిన్నముఠా ఆధిపత్యంవుంది. ఈ పత్రికా యజమానులలో $3\frac{1}{2}$% స్వాధీనంలో, 40% దినపత్రికలున్నాయి. 0.3% యజమానుల స్వాధీనంలో మొత్తం పత్రికలలో నూటికి 33 వంతులువుంది. ఈరెండో ముఠాకు అమెరికా "ప్రజాభిప్రాయాన్ని" తయారు చేయడంలో ప్రముఖపాత్ర వుంది. అమెరికాలోనున్న పత్రికా చక్రవర్తులెవరు? హియరెస్టు, స్క్రిప్స్ - హోవార్డ్సు, మాక్ కార్మిక్సు, పాటర్సన్సు, గన్నెట్సు. వీరు అమెరికాసామ్రాజ్యవాదులలో పూర్తిగా కరడుగట్టిన అభివృద్ధి నిరోధక దురాక్రమణదారులకు ప్రతినిధులు. అమెరికాలోవున్న పెట్టుబడిదారీ వార్తాపత్రికలన్నీ పైన ఉదహరించిన పత్రికా చక్రవర్తుల పలుకుబడిలోనే ఉన్నాయి.

ఈ రకమైన పత్రికలు, ప్రజల ప్రయోజనాలను ప్రతిబింబించవనే విషయం నిర్వివాదాంశం. అవి ప్రజలకు పూర్తిగా ప్రతికూలమైఖరి కలిగి

ఉంటాయి. యుద్ధం ముగిసినదగ్గర నుండీ, ఆంగ్లో - అమెరికన్ గుత్త పెట్టుబడిదారీ పత్రికలు అంతులేని యుద్ధప్రచారాన్ని చేస్తున్నాయి. సామ్రాజ్యవాద రాజ్యాల కూటాల నిర్మాణానికి బాకాలూదుతున్నాయి. గ్రీస్, ఇండోనీషియా చైనాలలోని ప్రజాతంత్రఉద్యమాలను అణచివేయమని ఆందోళనచేస్తూ, ఆ దేశాలలోని అభివృద్ధినిరోధక వర్గాలకు మద్దతునిస్తున్నాయి. తూర్పు యూరప్ దేశాలపై గెప్పుడుప్రచారం చేస్తున్నాయి. సోవియట్ యూనియన్‌పై, అబద్ధాలను అల్లి మూడో ప్రపంచయుద్ధానికిపిలుపునిస్తున్నాయి. తమతమ దేశాలలోని కార్మికోద్యమాలనూ, అభ్యుదయకర ఉద్యమాలనూ వ్యతిరేకించుతున్నాయి,

ఈరకమైన పత్రికలనే సామ్రాజ్యవాదులూ, వారి ఆఫీసర్లూ, వారి అనధికార ప్రతినిధులూ "స్వతంత్ర" పత్రికలని చెప్పుకుంటారు. దీనినే వారు "పత్రికా స్వాతంత్ర్యం" అని డబ్బా వాయించుకొంటారు. ఈరకమైన పత్రికాస్వాతంత్ర్యాన్ని గురించి లెనిన్ మహాశయుడు యిలా అన్నాడు:

"అత్యున్నతమైన అచ్చుయంత్రాలూ, పెద్దపెద్ద పేపర్ స్టాకులూ, పెట్టుబడిదారుల చేతులలో వున్నంతకాలమూ పత్రికా స్వాతంత్ర్యం వున్నదని చెప్పడం వట్టి బూటకం. పత్రికలపై పెట్టుబడిదారుల ప్రాబల్యం ఉన్నంతకాలం, పత్రికా స్వాతంత్ర్యం ఉంటుందనడం, శుద్ధ వెర్రితనం......ధనికవర్గాలు పత్రికలను తమ ప్రయోజనాలకోసం, మలినం చేయడానికి వున్న స్వాతంత్ర్యాన్నే పెట్టుబడిదారులు పత్రికా స్వాతంత్ర్యం అని పిలుస్తారు. ప్రజాభిప్రాయంఅనే పేరుతో కట్టుకథలను ప్రచారంచేసి, సత్యాన్ని మరుగుపరచడానికి డబ్బును వినియోగించడాన్నే వారు పత్రికా స్వాతంత్ర్యం అని డబ్బా వాయించుకుంటారు."

రెండు ప్రపంచాలలో - సోషలిస్టు, కేపిటలిస్టు ప్రపంచాలలోవున్న పత్రికల స్థితిగతులవి. పెట్టుబడిదారీ విధానం యొక్క సంకెళ్ల నుండి ప్రజలు విముక్తి పొందని యే దేశంలోనూ, నిజమైన పత్రికా స్వాతంత్ర్యం ఉండనే ఉండదు.

పెట్టుబడిదారీ దేశాలలోని పత్రికలవలెగాక, సోవియట్ పత్రికలు ప్రజలలో వేళ్ళు పాతుకొనిపోయి, మహత్తర విప్లవకర మార్పులను తీసుకొనివచ్చాయి. స్వాతంత్ర్యాభిలాషియైన మానవజాతి అభ్యుదయానికీ, సౌభాగ్యానికీ, స్వాతంత్ర్యానికీ శాంతికీ సౌభాతృత్వానికీ సోవియట్ ప్రజల పత్రికలు ఆదర్శజ్యోతులుగా వెలుగొందుతున్నాయి

— సోవియట్ లాండ్ నుండి

(టాస్‌న్యూస్ ఏజెన్సీ పత్రిక) ఢిల్లీ. 20.3-49

71

# అర్థశాస్త్రం

రచన:
లియాన్‌టీవ్

అనువాదం:
నండూరి ప్రసాదరావు

తప్పనిసరిగా జరిగే పెట్టుబడిదారీ వ్యవస్థ నాశనాన్ని, సోషలిజ విజయాన్ని తెలిపే సూత్రాలను దాచడానికీ, మరుగు పరచడానికీ, తారుమారు చేయడానికీ బూర్జువావర్గం, దాని ఆర్థిక శాస్త్రవేత్తలూ ఎల్లప్పుడు ప్రయత్నిస్తారు.

పెట్టుబడిదారి విధానం అనాది సిద్ధమనీ, శాశ్వతమని నచ్చజెప్పడానికి తంటాలు పడతారు.

ఈ విధంగా వారు ప్రజలను యధార్థవిషయాలకు చాల కాలం దూరంచేయ గలిగారు.

కాని పెట్టుబడిదారీ విధానం దోపిడినీ, పీడననూ మూలమూలలా పరిశోధించి బట్టబయలు చేసింది, మార్క్సిస్టు–లెనినిస్టు అర్థశాస్త్రం. బూర్జువా ఆర్థిక శాస్త్రవేత్తలు మరుగుపరచే రహస్యాల నన్నింటినీ యిది బయలు పెట్టింది.

కామ్రేడ్ లియాన్‌టీవ్ మార్క్సిస్టు దృక్పథంతో రచించిన ఈ "అర్థశాస్త్రం" అర్థశాస్త్రంలో 'ప్రారంభపాఠాలుగా', అందరికీ వినియోగపడుతుంది. మార్క్సిస్టుమూల సూత్రాలను అర్థంచేసుకొనేందుకు యీ గ్రంథం ఎంతగానో సహాయపడుతుంది.

అందరూ తప్పక చదవాల్సిన గ్రంథం.

331 పేజీల గ్రంథం – వెల 3–0–0

ప్రతులకు:
లీలాబుక్‌డిపో విజయవాడ.

# జనత కార్యాలయంపై దాడి

## మేనేజరు, ఏజంటు, సహాయ సంపాదకుల అరెస్టు

**మార్చి 14వ తేదీ షుమారు 12 గంటలకు సి. ఐ. డి. ఇనస్పెక్టరూ, మరి కొంతమంది పోలీసుఉద్యోగులూ విజయవాడలోని మా బ్రాంచి ఆఫీసుపై దాడిచేశారు. ఆఫీసు అంతా సోదాచేశారు. శ్రీ గోటేటి జోగిరాజు గారి 'వ్యవసాయశాస్త్రం' టి. సావిత్రిగారు వ్రాసిన 'చైనాస్త్రీల' వ్రాత ప్రతులూ, ఆఫీసు ఉత్తరాలఫైలూ వగైరా తీసుకొని వెళ్ళారు.**

ఇంత చేసినా ఏమాత్రం నిషిద్ధసాహిత్యంకానీ, మరేవిధమైన అభ్యంతర కరమైన కరపత్రాలుగాని ఏమీ దొరకలేదు.

కార్యాలయ మేనేజరు శ్రీ యస్. ఆనందరావుగారినీ, సంపాదక వర్గసభ్యులైన శ్రీ వాసిరెడ్డి భాస్కరరావుగారినీ, తన ఏజన్సీ విషయం చూసుకోవడానికి ఆఫీసుకు వచ్చిన కడపజిల్లా 'జనత' ఏజంటును అరెస్టు చేసి తీసుకొని వెళ్ళారు.

అరెస్టులకు ఇంతవరకుకూడా కారణం తెలుపకుండా ఇకముందు నేరం చేస్తారనే అనుమానంమీద 151 సెక్షను క్రింద రిమాండులో వుంచారు. ఇకముందు వారిపై ఏవిధమైననేరాన్ని మోపుతారో తెలియదు.

సోదర పత్రికా సంపాదకులూ, జనత పాఠకులూ, మేధావులూ, ప్రజలూ ఈ దారుణచర్యను ఖండించి, అరెస్టు చేయబడినవారిని విడుదల చేయవలసినదిగా డిమాండు చేయాలని కోరుతున్నాను.

విజయవాడ
28—3—49

—గంగినేని వెంకటేశ్వరరావు.
సంపాదకుడు : జనత

Regd. No. 5296 JANATA 1st April '49-As. 8



# రెండు ప్రధాన సిద్ధాంత వ్యాసాలు

## ప్రజాస్వామిక ప్రజాతంత్రం

మనం ప్రజాతంత్ర విప్లవదశలో ఉన్నామా? లేక సోషలిస్టు విప్లవదశలో ఉన్నామా? ఈ రోజున మన నినాదం ఏది? శ్రామికవర్గ నియంతృత్వమా? లేక కార్మిక కర్షకుల ప్రజాస్వామిక నియంతృత్వమా? భారతదేశంలోని ప్రజాతంత్ర సంఘటనలో ఏయేవర్గాలు వుంటాయి? ప్రజాస్వామిక ప్రజాతంత్రరాజ్యం ఏయే వర్గాలకు ప్రాతినిధ్యం వహిస్తుంది? ప్రస్తుత భారతపరిస్థితుల్లో పెటీబూర్జువాకు ఏమైనా విప్లవకరపాత్ర ఉందా? ఇవన్నీ — ఈ వ్యాసంలో క్షుణ్ణంగా చర్చించబడ్డాయి.

## భారత వ్యవసాయ సమస్య

పారిశ్రామికంగానూ, వ్యావసాయికంగానూ చాల వెనుకబడివున్న వలస, అర్ధవలసదేశాలు రాజకీయంగా, ఆర్థికంగా, సాంఘికంగా ముందుకు పురోగమించాలంటే వ్యావసాయిక విప్లవం తప్పనిసరి అవుతుంది. ఈ వ్యాసం భారత వ్యవసాయ సమస్యను కూలంకషంగా చర్చించి కర్షకాంగంలోని ఏ యే వర్గం వ్యావసాయిక విప్లవంలో ఏ యే పాత్ర నిర్వహిస్తుందో వివరిస్తుంది. ప్రస్తుతదశలో వ్యవసాయరంగంలో మన ప్రధాన బాధ్యతలను గురించి విస్పష్టంగా తెలియజేస్తుంది.

ఈ రెండు ప్రధాన సిద్ధాంత వ్యాసాలూ అందరూ తప్పక అధ్యయనం చేయాలి. ఈ వ్యాసాలు ప్రకటించబడిన **జనత ౮వ సంచిక** ఇక కొద్ది కాపీలు మాత్రమే ఉన్నాయి. వెంటనే ఆర్డర్లు ఇవ్వండి.

Edited, Printed and Published by Gangineni Venkateswara Rao Guntur
Printed at Rasatarangini Press, Vijayawada



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA134M112 |
| పుస్తకం పేరు | జనత |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 77 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CL BCL |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Navya |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | ch. Ramya |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |